# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజంయ సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు, విద్యార్థులకు ఈ మెటీరియల్‌ను అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్నో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

గమనిక: గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్‌**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

Pallavi. Akurathi

# Telugu Literature

## Paper - I

## Section - B

ఉదాహరణ ప్రక్రియ

శివకవుల రచనా వైశిష్ట్యము

నవ్య సంప్రదాయ ఉద్యమం

రామదాసు - ఆత్మాశ్రయ కవిత

భావ కవిత్వ శాఖలు

రామదాసు కీర్తనలు - సాహితీ సౌందర్యం

అన్నమయ్య కీర్తనలు - సాహితీ సౌందర్యం

త్యాగరాజ కృతులు - సాహితీ సౌందర్యం

శ్రీనాథుడు - అనువాద విధానము

శ్రీనాథుని కవితా రీతులు

తిక్కన నాటకీయత

తిక్కన కవిత్వ ప్రౌఢి ( ప్రౌఢి = నైపుణ్యం )

ఎర్రన కవితా రీతులు

భక్తి కవిత్వ శాఖ - ఎర్రన మార్గదర్శకత్వం

# [illegible]

క్షేత్రయ్య సాహిత్య సౌందర్యం

జాను తెనుగు

ప్రాఙ్నన్నయ యుగ శాసన సాహిత్య స్వరూపం

సంస్కరణోద్యమ సాహిత్యం

పోతన కవితా రీతులు

పోతన అనువాద విధానము

పోతన భాగవత విశ్వజనీనత

పోతన భాగవత భక్తితత్త్వం

విజయ విలాసము - పద్య చమత్కృతి

తెలుగు నవల పుట్టు పూర్వోత్తరములు

రఘునాథ నాయకుడు - కవితా శైలి

నాచన సోముని నవీనగుణ సనాథత్వం

మార్గ-దేశి కవితా సంప్రదాయాలు

# ఉదాహరణ ప్రక్రియ

ఇది కవులు ప్రారంభించిన విశిష్టమైన సాహిత్య ప్రక్రియ. సంస్కృత ఛందస్సులను కూడా ఉపయోగిస్తూ రచింపబడిన దేశి ప్రక్రియ ఉదాహరణం.

ఉదాహరణ వాఙ్మయం పై మొట్టమొదటిసారిగా, విపులంగా కృషి సల్పిన వారిలో ప్రసిద్ధులైన నిడదవోలు వేంకటరావు గారు తమ "ఉదాహరణ వాఙ్మయ చరిత్ర" లో ఉదాహరణ లక్షణాలను క్రింది విధంగా వివరించారు.

1) ఉదాహరణము లనే భాషలో గల ఏడు విభక్తులను, సంబోధనను ఉదాహరించేవి.

2) ఇవి ప్రధానంగా దేవతాస్తుతి పరమైనా, తర్వాత మానవ స్తుతి పరంగా కూడా వెలువడ్డాయి.

3) ప్రతి విభక్తికి ఒక వృత్తం - ఒక కళిక - ఒక ఉత్కళిక లేక అర్థకళిక ఉండాలి.

4) వృత్తాలలో చంపకోత్పలమాలలు, శార్దూలమత్తేభాలు వాడాలి.

5) కళిక అనేది రగడ భేదం. దీనిలో 8 పాదాలుంటాయి. ఉత్కళిక లక్షణాలు కళిక వంటివే గాని ఉత్కళిక ఏక సమాసంగా ఉండాలి.

6) ఈ కళిక, ఉత్కళికలు సంస్కృత శబ్దములు గాక తెలుగు ప్రధానంగా ఉండాలి.

7) సంబోధనాన్ని చివర సార్వవిభక్తికంగా ఒక వృత్తం

8) చివరి పద్యం అంకిత పద్యం. దీనిలో కవి పేరు, రచన పేరు ప్రస్తావించబడతాయి.

ప్రతి ఒక ఉదాహరణం లో విడువిభక్తులు, సంబోధన కలిపి ఒక్క దానికి మూడు పద్యాల చొప్పున ఇరవైనాలుగు పద్యాలు; ఇంతిగాక సార్వవిభక్తిక పద్యం, అంకిత పద్యం అనగా కలుపుకొని మొత్తం 26 పద్యాలు ఉంటాయన్నమాట.

ఉదాహరణం లోని వృత్తాలు సంస్కృత ఛందస్సు కాగా కళికలు, ఉత్కళికలు రగడ భేదాలు కాబట్టి దేశి ఛందస్సు. ఈ విధంగా చూస్తే ఉదాహరణం మార్గదేశి కవితా సమ్మిశ్రితమైన దేశి ప్రక్రియ.

కళికలో ప్రతి పాదం చివర విభక్తి ప్రత్యయాలు ఉంటాయి. ఉత్కళికలో చివరి రెండు పాదాల్లో మాత్రమే విభక్తి ప్రత్యయాలు ఉంటాయి.

ఉదాహరణం లో ఒక భాగం సంస్కృతం కాగా మరొక భాగం సంకేతం.

శివకవులు రచించిన ఉదాహరణ రచనల్లో మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వసారం' మొదటిది అంటారు. కాని దీని తర్వాతి కాలంలోని ఉదాహరణ లక్షణాలు దీనిలో యథాతథంగా సరిపోవు.

లక్షణ పరిపుష్టమైన ఉదాహరణ రచన పాల్కురికి సోమనాథుడే ప్రారంభించాడు. ఆయన

రచించిన ఉదాహరణలలో బసవోదాహరణం, పండితారాధ్య ఉదాహరణం ముఖ్యమైనవి. వీటిలోని నిర్దేశించిన లక్షణాల తర్వాత చతురతాని రంగన గూడా ఉదాహరణలను రచించారు.

ఉదాహరణ ప్రక్రియను శైవకవుల తర్వాత వైష్ణవ కవులు కూడా ఆదరించారు. తాళ్ళపాక పెదతిరుమలయ్య "శ్రీ వేంకటేశ్వరోదాహరణం" ప్రసిద్ధమైంది.

దేశి సాహిత్యంలోని ఈ పద్ధతి కల్పిన తరువాత ప్రబంధ యుగం లనూ ఉదాహరణలు వెలువడ్డాయి. గణపవరపు వేంకటకవి "వేంకటేశ్వరోదాహరణం" ముదుమాటి సాంబకవి "రఘునాథీయోదాహరణం" మొదలైనవి రాయబడినట్లు తెలుస్తోంది. నేడు లభ్యం కావడం లేదని నిడదవోలు వారు పేర్కొన్నారు.

## ఆధునిక యుగం లో ఉదాహరణా కావ్యం :

శివకవి యుగం లో మత సాహిత్యం లో భాగం గా వెలసిన ఉదాహరణ ప్రక్రియ అప్పట్లో దైవస్తుతి కే పరిమితమైంది. అయితే తరువాత ప్రబంధయుగం లోని ముదుమాటి సాంబకవి "రఘునాథీయోదాహరణం" ద్వారా ఉదాహరణకావ్యం రాజస్తుతి కి వాడబడడం మొదలైందని తెలుస్తుంది.

ఉదాహరణమనే ఈ విశిష్ట సాహిత్య ప్రక్రియ ని ఆధునిక కాలంలో సంస్కరణోద్యమ నాయకులు, జాతీయోద్యమ

కానీ ఇవన్నీ ప్రయోగాలు గానే నిలిచాయి

ప్రధాన స్రవంతి లో భాగం కాలేకపోయాయి.

ఉదాహరణ ప్రక్రియ తెలుగు లో స్వతంత్రంగా

ఉదయించి సంస్కృతం లోకి ప్రవేశించి సంస్కృత లాక్షణికుల

చేత గుర్తింపబడి తెలుగు దేశి ప్రక్రియ కి సంస్కృత సాహిత్యం లో

గౌరవం తెచ్చిపెట్టిన గొప్ప దేశి ప్రక్రియ.

అయితే తెలుగు సాహిత్యంలో ఉదాహరణ ప్రక్రియ

ఏ దశలో పుట్టినా ఆరంభ దశ/వైభవ దశ గానీ. అలా క్రమేణ

కాలం లో ఈ ప్రక్రియ తెలుగు సాహిత్య ప్రపంచం లో క్రమక్రమంగా

మరుగునపడిపోయింది. అయినప్పటికీ ఒక అద్భుత మార్గదేశి

సాహిత్యం గా ఒక చక్కని కీర్తిగా నిలబెట్టుకుంది.

# శివకవుల రచనా వైశిష్ట్యము

తెలుగు సాహిత్య చరిత్రలో నన్నయ-తిక్కనల మధ్యకాలం శివపారమ్య ప్రబోధ గ్రంథాలు వెల్లువెత్తడంలో 'శివకవియుగం' గా పేరొందింది. నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, మల్లికార్జున పండితారాధ్యుడు, శ్రీపతి పండితుడు, మంచన పండితుడు, యథావాక్కుల అన్నమయ్య, చతుర్వాచి రంగన ప్రముఖ శివకవులు. వీరి కవిత విశిష్టమైనది. స్వతంత్ర రచనలనదగ్గ వీరి కృతుల్లో అటు శివపారమ్యం ఇటు దేశీయత్వం రెండూ పరవళ్లు తొక్కుతుంటాయి.

శివకవుల సాహిత్యంలో ప్రధానంగా కింది అంశాలను గమనించవచ్చు.

1) శివ పారమ్యాన్ని ఉద్బోధించడం :

కావ్యరచనా దృష్టి గల నన్నెచోడునికి శివపారమ్యాన్ని ఉద్ఘాటించడం అతని ప్రాధాన్యతల్లో ఒకటైంది. శివుడు పరమేశ్వరుడు వేదకర్త, సకల శాస్త్రాలదాత అని చెప్పి అన్యదేవతాక్షేపణం కూడా చేశాడు. శివకవులకు వల్లమాలిన శైవమతాభిమానం ఉండడంతో వారు శివభక్తిని బోధించ దానికే కవిత్వాన్ని సాధనంగా గ్రహించారు. మల్లికార్జునుడు 'శైవస్మృతి' గా పేరొందిన తన 'శివతత్త్వసారము' లో పరమతాన్ని నిరసించాడు. ఇక పాల్కురికి శైవమతావలంబుల పాండిత్యాదుల కోసం ద్విపదలో రాయడమే గాక శైవమతాత్మ వైశిష్ట్యము ను చాటే సిద్ధాంతాలూ రాశాడు.

ఇతని 'బసవపురాణం', 'వృషాధిపశతకము' శైవేతరులని శివభక్తులుగా మార్చడానికి ఉద్దేశించినట్లు గా చెప్పబడతాయి.

2) దేశీయతాదృక్పథం :

తెలుగుబాస, ఉద్రేకం, [illegible] కలం మత విషయం లక్ష్యాలు గా పేరు సాంప్రదాయ విషయాలను చూపి దేశీయతాదృక్పథాన్ని నడిపారు. నన్నెచోడుడు 'మార్గ దేశిమార్గము' అని ప్రకటించుకుని ఒక విశిష్టమైన పాల్కురికి ద్విపద కి పట్టం కట్టి దేశి ని లక్ష్యం గా ఆచరణలో పెట్టాడు.

అ) ఛందస్సు లో దేశి : ప్రక్రియ లో కూడా దేశి

ద్విపద కావ్యంలో అష్టాదశవర్ణనలు, నవ రసాలు, అలంకారాలు చెప్పి దాన్ని మహాకావ్యం గా మలచి ద్విపద కి ఒక ప్రతిష్ఠ కోసం ఉద్యమించాడు. [struck], రగడ, [struck], సీసములు, [struck] వంటి దేశి ఛందస్సులను వెలుగు లోకి తెచ్చాడు. దేశి ఛందస్సులతో పాటు దేశి ప్రక్రియల్ని వెలుగు లోకి తెచ్చాడు.

ఆ) వస్తువు లో దేశి :

'కుమారసంభవం' లాంటి గహనమైన వృత్తాంతాలు నన్నెచోడుని దేశీయతాభిమానాన్ని వ్యక్తం చేస్తుంది. అలా పాల్కురికి తన కావ్యాలకి వస్తువు ను పురాణాల నుండి గాక దేశీయగాథల నుండి గ్రహించాడు.

3) భాష లో దేశి :

సోమనాథుని కవితలు భాషా సంప్రదాయాల్ని, వ్యాకరణ నియమాల్ని పాటించలేదు.

భాషా స్వేచ్ఛ లేని తన కవితా ప్రవాహానికి ఎవరి
పాణినీయాది నియమాల్ని నిరాఘాటంగా ఉల్లంఘించాడు సోమనాథుడు.
దుష్ట సంధులు, వైరి సమాసాలు, లింగవ్యత్యయాలు మొదలైనవి
యథేచ్ఛగా ప్రయోగించి శివభక్తులు ప్రజల భాషకు ఆదరణ
కల్పించాడు.

ఉదా: అజ్ఞపదాలు - కర్షణ, తర్జు, కష్టి.

(అఖ్య) ఆకారలోపం - అదియెదర, ఆరవలు.

కర్తృమూలం (కర్తృమూలం) నీవెల్లి, పోయిట్లి, పెట్టిచ్చు.

వైరి సమాసాలు - మల్లెపువ్వు, శివమునులు, ఇతరవేళలు,
నిర్భయపడి.

ముఖ్యంగా, పాల్కురికి 'బసవ పురాణం' లో

'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను తెనుగు
చర్చింపగా సర్వ సామాన్య మగుట'

అని 'జాను తెనుగు' ను ప్రశంసించాడు. సర్వజన సుబోధకమైన తెలుగే
జానుతెనుగని విమర్శకుల అభిప్రాయం. శివభక్తులు ఈ జానుతెనుగు
ను ఆదరించారు.

3) కవిత్వ లక్షణములు : కవితాశైలి

నన్నెచోడుడు తనది వస్తుకవిత అని చెప్పుకున్నాడు.
వర్ణనా ప్రధానమైన అలంకార శైలియే వస్తుకవిత అనవచ్చు.
శైలి పై ఎంతో ఆదరం పెంచుకున్న సోమనాథుడు
సంస్కృత కావ్య మార్గాలతో పాటు అలంకార లక్షణాలు

5) వర్ణనా నైపుణ్యము :

నన్నెచోడుడు వర్ణనా ప్రియుడు. ఆయన వివిధ గుణాల్ని కల్పనా శక్తికి అగ్రతాంబూలం. గ్రీష్మ ఋతు వర్ణన చేసిన ఈ క్రింది పద్యం ఆయన ప్రకృతి వర్ణన ప్రతిభకు నిదర్శనం.

"తలచిన డెందము కందును -- "

"అలవడ ఖేటి నిడుద రయమొంచిన మానుల క్రింద దూరెనే----"

ఇక నన్నెచోడుని యుద్ధ వర్ణనలు తిక్కన యుద్ధ వర్ణనల కన్నా మేల్తరమని అంటారు.

పాల్కురికి పాత్రల రూప వర్ణనలో చిత్రకారుడే కన్పిస్తాడు. బసవపురాణం లో శివుని గుజ్జువేషవర్ణన, పండితారాధ్య చరిత్ర లో శివుని చండాలవేషధారణ వర్ణన ఇందుకు ఉదాహరణలు. స్వభావోక్తి రమణీయంగా పాల్కురికి వర్ణించిన కేళి వర్ణన

"తోలు తొడి గమిచ్చి నిలిచి పైవెంచి కలకల తొట్రు సడలించి నీళ్లి
గ్రుక్కిన గాలించి కంఠంబు విచ్చి ముక్కున నీటు నల్లి వచ్చి
వెక్కించి మెదలించి నిక్కి మిన్న నుంచి కన్నుతో నీయని కొలయుమున్న-"

ఆధునిక 'యానిమేషన్ సినిమా' లా కళ్ళకు కడుతుంది.

6) రస పోషణము :

నన్నెచోడుని కుమార సంభవం లో శివపార్వతుల సంయోగ సందర్భంలో శృంగారం, తారక కుమారస్వామి యుద్ధంలో

అద్భుతవీర భయానక రసాలు, దక్షాధ్వర ధ్వంసం లో రౌద్రం, రతీవిలాపంలో కరుణం, శివతపోనిష్ఠ లో శాంతం, ఇలా సందర్భశుద్ధి లో రసపోషణ చేయబడింది.

పాల్కురికి బసవ పురాణం భక్తి వీరస్ఫూర్తి కథనం గా గల గ్రంథం. భక్తి రసమే ఇతర రసాలన్నింటా పొంగుల పారినా లోన చెప్పుట్లు ' నవరస రసికుల భువిని వెలసిన శివకవి వరుల చిత్తంబులలర ' నవరసాల్ని పోషించాడు.

7) ఉక్తివైచిత్రి :

కావ్యంలో శబ్దగతమైన చమత్కారాలకు ఉక్తివైచిత్రి ఉపయుక్తమౌతుంది. నన్నెచోడుని

" వాన్నలుపూచే బాన్నలాగి ---- "

ఈ పద్యం లో పద్య ప్రారంభంలో పాన్నలు మొదట పూచినట్లు భావార్థం చెప్పి చివరికి మొందుగతే మొదట పూచినవని తెలుస్తుంది.

8) రచనా విధానము :

వీరి సాంప్రదాయానికి చెందిన వీరగాథల రచనల్లో కన్పించే సామాన్య లక్షణాలు కొన్ని పాల్కురికి గ్రంథాలలో కన్పిస్తున్నాయి. ఆమ్రేడితాల ఆదరంగా మళ్ళీ చూస్తారు. పునరావృత్తిని ద్విపదల పాదాంతాలలో చెప్పి చదివితే అవి కూడా వీరగాథల వలె గానయోగ్యాలై ఆనందాన్నిస్తాయి.

ఉదా: శివరాత్రి నిత్యంబు చెల్లించు బాస తందానతాన
శివభక్తులెల్లను శివుడను బాస తందానతాన

# నవ్య సంప్రదాయ ఉద్యమం

Additional points

→ ఖండ కావ్యాలలో జాషువా గారి 'బాపూజీ' 'నేతాజీ'

→ గాంధీ మహాత్ముని స్వీయచరిత్రను తుమ్మల సీతారామమూర్తి గారి పద్యరూపాంధ్రీకరణం.
ప్రబోధానంద ధన్వంతర వేదాంతాచార్యులు గారి 'జగదీశచంద్ర బోసు జీవితచరిత్ర'
ముదివర్తి కొండమాచార్యులు 'బుద్ధ చరిత్రం'

→ పుట్టపర్తి నారాయణాచార్యులు ఏకాంతంలో మార్క్స్, రవీంద్ర, తులసీదాసుల వంటి విభిన్న వ్యక్తుల ప్రభావం కనిపిస్తుంది.

→ 1806 నుండి 1906 వరకూ జరిగిన భారత స్వాతంత్ర్య సమరగాథ ని ముదిగొండ వీరభద్రమూర్తి 18 ఖండాలలో మహాభారత మహేతిహాసం స్ఫూర్తితో 'వందే మాతరం' పేరుతో రచించారు.

→ ఉయ్యాలవాడ నరసింహారెడ్డి స్వాతంత్ర్య పోరాట గాథ ని 'స్వాతంత్ర్య వీరుడు' పేరుతో పాణ్యం నరసరామయ్య వీరరస ప్రాధాన్యం గా రచించారు.

→ మధురకవి బెళ్లూరి శ్రీనివాసమూర్తి 'వివేకానంద చరిత్ర' అను ద్విపద కావ్యం రాశారు.

→ కొండవీటి వెంకటకవి గారి 'నెహ్రూ చరిత్ర'.

→ సర్దేశాయి తిరుమలాచార్యులు 'శ్రీ ధూర్జటి పంచమహా

కావ్యాలు' గా శివ భారతం, రాణా ప్రతాప సింహ చరిత్ర, ఆంధ్ర పురాణం, వందే మాతరం, పోతన చరిత్రం లను చెప్పారు.

→ 'నవ్య' సంప్రదాయం లో 'నవ్య' వెనుకగల అంశాలు

- అవిచ్ఛిన్న మహాకావ్య రచనా సంప్రదాయాన్ని పునరుద్ధరించాలన్న లక్ష్యం
- Neo-classicism లాంటి ఆంగ్ల మేటి ప్రభావం
- చరిత్ర లాంటి ఆధునిక శాస్త్రాన్ని ఉపయోగించుకున్న ఆధునిక
- స్పృహ గల రచనలు

→ నవ్య సంప్రదాయ ఉద్యమ సేవ :

- ఆధునిక తెలుగు సాహిత్యమంతా చిన్న ప్రక్రియలకే పరిమితమై మిగిలిపోకుండా మహాకావ్య ప్రక్రియని ఆదరించింది / కొనసాగించింది.
- నవ్యయుగంలో ప్రాచీన కవులపై అవగాహన కలిగిస్తూ చక్కటి విమర్శలు వెలువడ్డాయి.
- చలం నవలల్లో (మైదానం, బ్రాహ్మణీకం, [illegible]) కల్పించే వివాహేతర సంబంధాల్ని నైతికత కి ప్రమాదం కలిగిస్తాయని హెచ్చరిస్తూ 'వేయిపడగలు' వంటి నవలల ద్వారా చెప్పారు.

→ పాత కథ అయితే అది కథా బలిమే గాని కవి బలం కాదని తెలిసి కొత్త వస్తువు ని తీసుకుని దాన్ని ప్రాచీన పద్య పద్ధతుల్లో రాసి మెప్పించి తన గొప్పతనం నిరూపించుకున్నారు గుర్రం జాషువా. ఇలాంటి

'మొంటాక్ మహల్' 'ఫిరదౌస్' వంటివి ఇందుకు ఉదాహరణలు. ఈ శిల్పం బాగుగా విభిన్న నవ్యసంప్రదాయ వాది.

→ నవలా రచయితల్లో తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు 'ధర్మనిర్ణయం' 'మనసు మారింది' మల్లాది వసుంధర 'తంజావూరు పతనం' ఏకశిలాల కృష్ణమూర్తులు, చివుకుల రవి రాసిన కొన్ని విరాసాత నవలలు నవ్య సంప్రదాయ మార్గానివని చెప్పవచ్చు.

→ కథారంగ రచయితల్లో మున్నెం శారద, వరాల వెంకటేశ్వర్రావు వంటి వార్ని చెప్పవచ్చు.

→ సాంప్రదాయ విమర్శ లో జీవియస్, సంపత్కుమార, సుప్రసన్న, ఆర్.ఎస్. సుదర్శనం, కేశిరాజు రమాపతిరావు, ముదిగొండ వీరభద్రయ్య వంటివారు నవ్యసంప్రదాయ మార్గం లోని వారు.

→ అస్తిత్వ వాదం లో స్త్రీవాద, దళితవాద, ముస్లింవాద (ఇస్మాయిల్ గారు) ధోరణులు ధాటి లో నవ్య సంప్రదాయానికి ఏ గొప్ప అనుయాయులు మిగల్లేదు. చాలా గొప్ప నాయకుడు పుట్టడం కూడా ఒక ఉద్యమానికి ఒక విధంగా నష్టమేనని చెప్పాలి. ఎందుకంటే మళ్లీ అటువంటి రావడం చాలా కష్టం కాబట్టి. నవ్యసంప్రదాయ ఉద్యమ విషయంలో అదే జరిగింది.

29.7.04

# రామదాసు - ఆత్మాశ్రయ కవిత

అనంతర ప్రబంధ యుగం లోని భక్తి పదకర్తలలో తెలుగు వారందరి గుండెలు దోచుకున్నవాడు నేటికీ ప్రతి పల్లెలోనూ వాడుకగా భజనలు పాడేలా తన పదకవితలతో తెలుగు వారి ఇళ్లల్లో ఆత్మీయునిగా నిలిచిపోయినవాడు రామదాసుగా ప్రసిద్ధుడైన కంచెర్ల గోపన్న. రామదాసు పదకవితల్లో చోటు చేసుకున్నంత ఆత్మీయత మరే కవితలోనూ కన్పించదు.

కవి తన భావాల్ని ప్రకటించడానికి గల రెండు మార్గాలుగా సాహిత్య విమర్శకులు Objective poetry (వస్త్వాశ్రయ కవిత) Subjective poetry (ఆత్మాశ్రయ కవిత) అని పేర్కొన్నారు. మన తెలుగు సాహిత్య విమర్శలో ఈ విభాగం ఆంగ్ల సంప్రదాయ ప్రకారమే వచ్చింది.

మన ప్రాచీన కవిత్వం లో వస్త్వాశ్రయ కవిత్వమే మనకు ఎక్కువ భాగం కన్పిస్తుంది. ~~అరుదుగా కన్పించే~~ ఆత్మాశ్రయ కవిత్వానికి రామదాసు కీర్తనలు నెలవు. ఆత్మాశ్రయ కవిత లో మూర్తి కల్పనం లేదు. కవియే దీనిలో ఆలంబన విభావం. భక్తిగాని, రక్తిగాని, సుఖంగాని, దుఃఖంగాని, ప్రణయం గాని, ప్రళయం గాని కవి స్వీయంగా అనుభవించి ఆలోచించి సూటిగా కవితాబద్ధమొనరుస్తాడు.

రామదాసు కీర్తనల్లో ఇట్టి చోట్ల తనలో(1) తాను కవి మాట్లాడుకున్నట్లుగా వ్యక్తీకరణ ఉంటుంది.

"ఏడ నున్నాడో భద్రాద్రి వాసుడేడ నున్నాడో
నా స్వామి రాముడేడ నున్నాడో"

ప్రతి తన రాముని కోసం తాను పడే తపన వెల్లడించాడు.

ఒక్కసారిగా తనతో పాటు కవి (2) రామ భక్తులందర్ని

పిలుపుకొని 'తక్కువేమి మనకు రాముడొక్కడుండు వరకు'

అని అంటాడు.

రామదాసు కీర్తనల్లో ఆత్మాశ్రయత్వం లో

అతి ముఖ్యమైన అంశం 'కవి ఆత్మీయత' (3). రామదాసు భగవంతుని తన

ఆత్మీయునిగా తలచి తన కష్టాలను దేవునితో ~~తీర్చాలనుకుంటూ~~ తెలుపుతూ

సంభాషిస్తున్నట్టుగా కీర్తనల్ని రచించాడు. అందుకే ఈ కీర్తనల్లో

నిష్ఠూరించడం, గద్దించడం, అలగడం, వెక్కి వాడవడం, బెదిరించడం; అంతలోనే బతిమాలడం, గారాబంగా

వేడుకోవడం, కీర్తించడం ఇలా మనం మన ఆత్మీయులతో

ప్రవర్తిస్తున్నట్లే కవి దేవునితో తన ఆత్మీయతని పంచు

కున్నారు తన కీర్తనల ద్వారా.

"నిన్ను బోనిచ్చెదనా సీతారామ నిన్ను బోనిచ్చెదనా

నిన్ను బోనిచ్చెదనా నన్ను రక్షింపకెన్ని విధములుగ

ఓ మా రామ

ప్రక్కట్టి వేసెద నిన్ను రెట్టుము నింక

దిక్కు గలిగితే మొరపెట్టుకోర రామ"

అంటూ బెదిరిస్తున్నట్లు మాట్లాడగలడు, అంతలోనే

'రామచంద్రుడు నాపై చలము చేసినాడు సీతమ్మ చెప్పవమ్మా'

అని సీతమ్మను వేడుకోనూ గలడు రామదాసు.

కీర్తనల్లో పదేపదే రామదాసు

నేను, నా, నన్ను వంటి (4) ఆత్మాశ్రయకవితా ద్యోతక పదాల్ని

విరివిగా వాడడం గమనించదగింది.

ఉదాహరణకు 

"రామచంద్ర నన్నేల రక్షింపవో నేనే మెరుగ
నీ చిత్తము నా భాగ్యము నిన్నే నెరనమ్మితి"

అనే కీర్తనని చెప్పుకోవచ్చు.

(5) క్రియాపదాలు తదితర వ్యాకరణ రూపాల్లో రామదాసు ఆత్మాశ్రయపరంగా వాడి తన కీర్తనల్లో అడుగడుగునా తానే కనిపిస్తాడు. అందుకు

"రక్షించే దొరవని నమ్మితి నిన్ను
రక్షింప తప్పేమి చేసితి"

"తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా"

వంటివి ఉదాహరణలుగా పేర్కొనవచ్చు.

ఈ విధంగా రామదాసు కీర్తనల్లో సర్వత్రా కవి తన ఆత్మానుభూతిని ప్రత్యక్షంగా వ్యక్తీకరించడం వలన ఆత్మాశ్రయకవిత గోచరిస్తుంది.

అయితే ఆధునిక ఆత్మాశ్రయకవిత లో కవి తన జీవితం లో తాను స్వీయంగా అనుభవించకపోయినా ఏ భావాన్నైనా తనది గా మలుచుకొని ఆత్మాశ్రయరీతి లో వ్యక్తీకరించగలడు. ఇటువంటప్పుడు ఆత్మాశ్రయకవిత్వానికి, కవి వ్యక్తిత్వానికి పొంతనుండవచ్చును గాని అభేద మారోపించలేము, కల్పించరాదు. కాని రామదాసు కవితలని ప్రతిదీ తాను జీవితం లో స్వీయంగా అనుభవించిన తన స్వీయాను భవాలే కృతి గమనించదగింది.

# అన్నమయ్య సంకీర్తనలు - సాహితీ సౌందర్యం

## I జానపద ప్రభావం

'కొలని దోపరికి గొబ్బిళ్ళో యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో'

'గుఱ్ఱు లాడేటి దొంగ గుయ్యాంగు వీడె
గుట్టెలానే దాగిని గుంగూరు'

ప్రాస నియమం

'చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెర మోవికి చాంగుభళా'

'అందనాడ అహా అందూన పురె
అందనాడ భళా అందూన'

'నెయ్యములల్లో నేరేళ్ళో
వొయ్యన నూరెడి వువ్విళ్ళో'

## II వర్ణనా వైభవం

'బ్రహ్మ కడిగిన పాదము' 'ఇందరికీ నభయంబు లిచ్చు చేయి' ఆ కీర్తనల్లో (శ్రీ) మహా విష్ణువు పాదము, చేయి గొప్పదనాన్ని వివరించేలా సాగిన వర్ణనలు అన్నమయ్య వర్ణనా కౌశల్యానికి తార్కాణాలు. 'ఇప్పుడిటు కలగంటి' అనే కీర్తనలో స్వప్నం లాగా కలలో చూసిన తిరువేంకటాచలాధిపుని వైభవాన్ని వర్ణించడంలో అన్నమయ్య చూపిన ప్రతిభ కొంతంగా దృశ్యసాక్షాత్కారం వెలువడింది. 'పిడికిట తలంబ్రాల పెండ్లికూతురు' కీర్తనలో పెండ్లికూతురిగా అమ్మవారిని కన్నుల ముందు రూపుకట్టిస్తారు.

## III కల్పనా ప్రతిభ

'ఇన్ని రాసుల యునికి యింతి చెలువపు రాశి' అనే కీర్తన లో అమ్మవారి సౌందర్యాన్ని అన్ని రాశులతో అన్వయం చెప్పించిన తీరు మనోహరం.

1) "కలికి బొమవింట్లు గల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి
కలువ కుచకుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు వారిమధ్యకును సింహరాశి . . .
— — — — "

'ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు'
అనే కీర్తన లో విష్ణుమూర్తి ని నవరత్నాలు గా ఉపమించడమే గాక ఆ నవరత్నాల్ని తగు స్థానం లో పొదిగిన అన్నమయ్య కల్పనా కౌశల్యం అపురూపం.

2) "అంత నింత గొల్లెతల అరచేతి మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము
కాంతుల మూడు లోకాల గరుడపచ్చ పూస
చెంతల మాలోనున్న చిన్ని కృష్ణుడు"

3) 'ఇట్టి ముద్దులాడి బాలుడేడ వాడు - వాని
పట్టి తెచ్చి పొట్టనిండ పాలు వోయరే'

అనే కీర్తన లో బాలకృష్ణుని చిలిపి చేష్టల్ని ఉపమించి అల్లిన చరణాల్లోని భావం ఎంతో మధురమైనది.

(IV) కొన్ని కీర్తనలు భజన రూపం లా సాగాయి.

ఉదా: నారాయణాయ నమో నమో
నానాత్మనే నమో నమో

- -

గోవిందాయ నమో నమో
గోపాలాయ "
భావజ గురవే "
ప్రాణాత్మనే "

దశ, సహస్ర, అనంత ఇలా ఉత్తరోత్తరంగా వృద్ధి చూపుతూ అంకెలతో అన్నమయ్య ఓ కీర్తన లో

(V) వైవిధ్యాన్ని చూపించారు.

దశ విధావతార ధర్మరక్షక మూర్తి
దశమస్తకాసుర దమన
దశ దిశా పరిపూర్ణ తపనీయ స్వరూప,
దశావరణ లోక తత్ప్రతీత

సహస్ర లోచన సంతత వినుత
సహస్రవదన శేష శయనా
సహస్ర కర కోటి సంపూర్ణ తేజా
సహస్రారది వృచక్రాయుధా

ఒక్కొక్కసారి అన్నమయ్య వింత

(VI) శబ్దాల తో తన కీర్తనలకు విశిష్టమైన సొబగులు సమకూరుస్తారు.

# త్యాగరాజ కృతులు - సాహిత్య సౌందర్యం

i) పునరుక్తి (1) ద్వారా భావావేశాన్ని వ్యక్తం చేయటం త్యాగయ్య గారి అనేక కృతుల్లో చూడవచ్చు.

ఉదా: "నమోనమో రాఘవాయ అనిశం
నమోనమో రాఘవాయ!"

"తవ దాసోహం తవ దాసోహం
తవ దాసోహం దాశరథే"

ii) త్యాగయ్య గారి కృతులన్నింటిలో దాదాపుగా అన్ని కృతుల్లోనూ "అనుపల్లవి" (2) కనిపిస్తుంది.

iii) ప్రాస నియమం (3)

త్యాగయ్య కృతులన్నింటా ప్రాస నియమం కన్పిస్తుంది. కొన్ని కృతుల్లో పల్లవి, అనుపల్లవి లకు ఒక ప్రాసాక్షరం వాడి చరణాలకు వేరే ప్రాసాక్షరం వాడారు.

ఉదా: నన్ను పాలింప నడచి వచ్చితివో? నా ప్రాణనాథ! ॥న॥
వనజ నయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి ॥న॥

సురపతి నీలమణి నిభ తనువుతో
ఉరమున --
కరమున --
ధరణి తనయతో ---

కొన్ని కీర్తనల్లో పల్లవి, అనుపల్లవి, చరణాలు అన్నింటిలో ఒకే ప్రాసాక్షరం వాడారు.

ఉదా: మరిమరి నిన్నే మొరలిడ నీ మనసున దయరాదు ॥మ॥

కరిమొర విని సరగున చన లేదా కారణమేమి?

సర్వాంతర్యామి ॥మ॥

కరుణతో ధ్రువుని కెదుట నిల్చిన కథ విన్నానయ్యా

సురరిపు తనయునికై నరమృగమౌ! గాచుట లేదయ్యా?

మరచియున్న వనచరుని బ్రోచిన మహిమ తెలుపవయ్యా?

ధరను వెలయు త్యాగరాజ సన్నుత తరము గాదిక

నే వినవయ్యా ॥మ॥

పై చరణం లో "అయ్యా" ద్వ్యక్షరం లో అంత్యప్రాస సాధించారు. మరోవైపు మొదటి పాదం చివర 'విన్నానయ్యా' అని చెబుతూ చివరి పాదం చివర 'వినవయ్యా' అని ముగించడం చక్కటి నాటకీయ సౌందర్యాన్ని సమకూర్చింది.

కొన్ని కీర్తనల్లో అన్ని చరణాల్లో ఒకే ప్రాసాక్షరం ఉంటే మరికొన్ని కీర్తనల్లో ఒక్కో చరణానికి ఒక్కో ప్రాసాక్షరం వినియోగించారు.

పరస్పర విరుద్ధ విషయాల్ని ప్రశ్నలతో మిళితం చెబుతూ ఏది నిజం గా

ఘనమైనదో చెప్పకనే (4) చెప్పేటువంటి క్రింది త్యాగయ్య గారి కీర్తన లోని నిందాస్తుతి సందర్భం రమణీయమైంది.

"నిధి చాల సుఖమా? రాముని స
న్నిధి సేవ సుఖమా? నిజముగ బల్కు మనసా
" నిధి "
దధి నవనీత క్షీరములు రుచియో? దాశ
రథి ధ్యాన భజన సుధారసము రుచియో?
" నిధి "
దమ శమమను గంగాస్నానము సుఖమా? క
ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమా?
" నిధి "
మమత బంధన యుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా?
" నిధి "

(5) <u>వృత్త్యనుప్రాస</u> లో త్యాగయ్య అనేక కృతుల్లో శబ్ద సౌష్ఠవాల సాధించారు.

<u>ఉదా:</u> భాగవతులు గూడి భోగములెల్ల వారి
కే గావింపుచు వీణాగానములతో
ఆగమ చరుని శ్రీ రాఘవుని బాడుచు
త్యాగరాజ మేలుని బాగుగ నమ్మినారు

(6) <u>అంత్యానుప్రాస</u> త్యాగయ్యగారి అనేక కృతుల్లో అందర్నీ అలరించే విషయం.

ఉదా: " సురపతి నీలమణి నిభ తనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత "

(7) ఈ విషయాన్ని సాక్షి చెప్పేందుకు, ప్రభావ వంతంగా వెల్లడించేందుకు త్యాగయ్య చేసే ఉపమాన చయనం అద్భుతంగా ఉంటుంది.

తెర తీయగరాదా ? నా లోని ॥తె॥
తిరుపతి వేంకట రమణా మత్సరమను ॥తె॥
పరమపురుష ! ధర్మాది మోక్షముల
పారద్రోలుచున్నది నా లోని ॥తె॥

" మత్స్యము యాకలి గొని గాలముచే
మగ్నమైన రీతి యున్నది
అజ్ఞమైన దీప సన్నిధిని మరు
గడ్డబడి చెరచిక్కున్నది ॥తె॥

ఇరవొందగ భుజియించు సమయమున
ఈగ దగులు రీతి యున్నది
హరి ధ్యానము సేయువేళ చిత్తము
యంత్యజువాడకు బోయినట్లున్నది ॥తె॥

(8) సంబోధనల ద్వారా తన కీర్తనల్లో ఎన్నింటికో త్యాగయ్య ఎంతో నిండుదనం సమకూర్చారు.

'ముందు వెనుక యిరు ప్రక్కలతోడై' అనే కీర్తనలో ఒక చరణమంతా కేవలం సంబోధనతో ఉంటాయి.

"ఓ గజరక్షక! ఓ రాజకుమారక! ఓంకారసదన! రారా!
భాగవత ప్రియ! బాగ బ్రోవవయ్య!
త్యాగరాజనుత! రారా!"

(9)

త్యాగయ్య కల్పనా ప్రతిభకు "నాద సుధారసం" అనే కృతి పరమోదాహరణం. ఇందులో తన ఆరాధ్యదైవమైన శ్రీరాముడికీ సంగీతానికీ అభేదాన్ని కల్పించుకున్నారు త్యాగయ్య.

నాదసుధారసం బిలను నరాకృతాయె మనసా
వేద పురాణాగమ శాస్త్రాదుల కాధారమౌ ॥నా॥
స్వరములారున్నొకటి ఘంటలు
వర రాగము కోదండము

అంటే... రాగమే రామకోదండము. సప్తస్వరాలు దానికి వ్రేలాడే ఏడు గంటలు. సంగీతానికున్న దురమయదేశ్య మార్గములే మూడున్న ఆ వింటికి మూడు అల్లెతాళ్ళు. కళ రాగ ప్రస్తార వేగమే రామబాణమైనది – ఈ విధంగా నాదసుధారసమే నరాకృతిని చెందినదట! సంగీత సాహిత్య ప్రపంచంలో ఇది ఒక అపూర్వకల్పన!

— ० —

త్యాగరాజు బోధనలు → p. 46

# శ్రీనాథుడు - అనువాద విధానము

(కావ్యరీతుల కర్త అయిన శ్రీనాథుడు)

పండితకవి, ఇతడు 15 వ శతాబ్దికి చెందిన వాడు. పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో విద్యాధికారి. ఇతడు సకల విద్యా సనాథుడు, (బహుగ్రంథకర్త.) ఇతని శృంగారనైషధము, హరవిలాసము, కాశీఖండము, భీమేశ్వర పురాణం, శివరాత్రిమాహాత్మ్యం మొ॥ ఇతని పాండిత్యానికి ప్రతీకలు. "కవిసార్వభౌమ" బిరుదాంకితుడైన శ్రీనాథుడు ఈశ్వరార్చన కళాశీలుడు, (బ్రాహ్మీదత్త వరప్రసాదుడు.)

శ్రీనాథుని ప్రౌఢశైలికి, పాండిత్యప్రకర్షకును 'శృంగారనైషధము' నిదర్శనమని చెప్పవచ్చు.

శ్రీనాథుడు తన అనువాదమున స్వతంత్రానువాద పద్ధతినవలంబించెను. సంస్కృతములోని నైషధము ప్రౌఢమహాకావ్యము గాన దాని విషయమున పురాణాలైన భారతము వలె స్వేచ్ఛానువాద పద్ధతి చెల్లదు. కావ్యాలు ప్రతిభా ప్రధానమగుటయే కాక ప్రతి శబ్దార్థ ప్రధానములును అగును. అపూర్వార్థాలైన ఇట్టి మూలములను దాని భావములతో ఛాయగా ననుకరించినవాడే నిజమైన ఆంధ్రకర్త యనిపించుకొనును. అట్లని ఆ దాని భావమే చేసినచో / ఆ దాన్నమే చేసినచో ప్రజ్ఞాశాలియైన కవియనిపించుకొనడు. శ్రీనాథునకీ సంకటావస్థయే తటస్థించినది. దీని నుండి తొలగి తన

శ్రీనాథుడే తన ఆంధ్రీకరణ పద్ధతిని

గురించి తన గ్రంథారంభమున

"నైషధ శృంగార కావ్యంబాంధ్ర భాషం విశేషంబునన్నేను

మదీయ హృదయంగమంబుగా -

శబ్దంబనుసరించియు,

అభిప్రాయంబు గుర్తించియు,

భావంబు భావించియు,

రసంబు పోషించియు,

అలంకారంబు భూషించియు,

ఔచిత్యం బాదరించియు,

అనౌచిత్యంబు పరిహరించియు

మాతృకానుసారంబున చెప్పబడిన యీ భాషానైషధకావ్యంబు."

అని వక్కాణించెను.

1) శబ్దంబనుసరించుట: మూలంలోని పద, సమాస విధేయమైన యథాతథము రచన ఇది.

ఉదాహరణకు హంస నలునితో తాను అన్ని దేశాలు చూశానని చెప్పే సందర్భంలో హర్షుడు 'గమ' క్రియతో 'గమికర్మీకృత నైక నీవృతా' అని చమత్కరించాడు.

దీని శ్రీనాథుడు

"కమలేందీవర ... గమికర్మీకృత నైకనీవృతుడనై కంటిన్ ..." అని 'శబ్దంబు ననుసరించి' అనువాదం చేశాడు.

## 2) అభిప్రాయము గుర్తించుట :

మూలము లో హంస దమయంతి తో

" విధిం వధూసృష్టి --- చక్రచక్రే " అనే శ్లోకం లో

శ్రీనాథుడీ శ్లోకములందలి భావమును స్వీకరించి తెనుగుదనము మూర్తీభవించిన నుడికారములో మూలమునకు వన్నెపెట్టు అనువాద పద్ధతిని చూపెను. అభిప్రాయమును గుర్తించి అనువదించిన విధమిది....

" అడిగితినొక్కనాడు కమలాప్తుని తేరికి వారువంబులై
నడచుచు 'సర్వలో నిషధనాధుని కెవ్వతె యొక్కొ భార్యయ
య్యెడు !' నని ; చక్ర ఘోషముల నిందుక యుండుక గాని, యంతయే
ర్పడ వినరైతి ; నీవనుచుఁ బల్కిన చందము దోఁచె మాకిదే ! "

'నేను బ్రహ్మరథానికి వాహనంగా ఉండి నలునికి భార్య ఎవరవుతారు? అని అడిగాను. ఇతర హంసల రెక్కల వల్ల బ్రహ్మ సమాధానం సరిగా వినబడలేదు గాని నువ్వని అన్నట్లు గుర్తు' అని హంస అంటుంది.

కాని రహస్యమైన విషయాన్ని ఇతర హంసల మధ్య అడగడం ఉచితం కాదు కాబట్టి శ్రీనాథుడు ఔచిత్యాన్ని పాటించి హంసల రెక్కల స్థానం లో చక్రఘోష ను ప్రయోగించాడు.

3) భావంబు పలుకఁబాయుట : 'ఉపలక్షించు' అంటే కనుగొనుట, ~~ఉపలక్షించుట~~ అనే అర్థాలున్నాయి. మూలం లోని భావాన్ని తెలుసుకొని దాన్ని మరింత బలంగా, రసవత్తరంగా ~~ఉపలక్షిస్తాడు~~ శ్రీనాథుడు.

తనని పట్టుకున్న నలుపు లో వారం పాలకే

" మదేకపుత్రా జననీ ...... కరుణార్ద్రచిత్తా" అనే మూలశ్లోకం లోని భావాన్ని తెలుసుకొని శ్రీనాథుడు తెలుగులో

"తల్లి మదేకపుత్రక పెద్ద కన్నుల గానఁజాలదు --- కేలూతనిచ్చునారు" అనే పద్యంలో కరుణారసం పొంగి పొరలేలా కవితా వర్ణించాడు.

4) ~~శృంగారంబు~~ రసంబు పోషించుట : శృంగార రసం గురించి రాయాలి.

శ్రీనాథుడు తన శృంగార నైషధము నందు కొన్నిచోట్ల స్వతంత్ర రచనా ప్రావీణ్యము ప్రకటించి రసపుష్టి కలిగించాడు. "తల్లి మదేకపుత్రక పెద్ద ---- " పద్యంలో కరుణరసాన్ని పోషించాడు. అట్లే మూలము నందున్న 'కపోత పాలికాయ' ను "కలకంఠ బాలె నిపుడు ---- వనప్రియ కంఠహుంకృతిన్" పద్యంలో వనప్రియ కంఠహుంకృతి గా మార్చి రసము పోషించినాడు.

వివాహ సమయము లో భోజనం చేసేటప్పుడు అమూలకమైన పద్యాలతో హాస్యరసాన్ని పోషించాడు.

5) అలంకారంబు భూషించుట : శ్రీనాథుడు మూలంలో లేని అలంకారాలను కల్పించటం, లేదా మరింత సుస్పష్టంగా అందంగా చెప్పటం వల్ల తెలుగు నైషధంలో అలంకార రామణీయకత

నలుని అందానికి రంభ, శచీదేవి, పార్వతి, లక్ష్మి, సరస్వతులు సైతం చాంచల్యము నందినట్లు మూలములో కలదు. జగన్మాతలకే దోషము అంటగట్టుట మిక్కిలి అనుచితమని భావించి శ్రీనాథుడు దానిని పరిహరించి " వినుతలి సుందరి జిక్కి ---- " అని పద్యంలో ఒక్క రంభ మాత్రమే చలించినట్లు పేర్కొన్నాడు.

అయితే మానవ స్త్రీల శృంగార వర్ణనలను మాత్రము శ్రీనాథుడు మూలం లోని దానిని అనుసరించే అనువదించాడు. అయితే ఇక్కడ కూడా మూలంలోని అశ్లీలాన్ని అంతవరకు పలుచబరచాడు.

మార్చిన తావు: హంస దమయంతి తో నలుని కి సేవ చేస్తానని చెప్పుతూ నలుడు 'స్మరకేళీలాలసుడై' యున్నప్పుడు పవన వీచెదనని చెబుతుంది, మూలము లో. హంస చెప్పిన ఈ సందర్భము అనౌచిత్యము, పైగా దాన్ని దమయంతి తో చెప్పుట మరింత అనౌచిత్యము గా శ్రీనాథుడు దాన్ని మార్చివేసి 'వైశాఖవేళలందు' గరుచ్చామరముల వీతునని, చెప్పాడు.

కథా సందర్భము ను మార్చుట /

కథాగతిలో చేసిన మార్పు:

మూలంలో దమయంతీ స్వయంవరమునకు ముందు భీమరాజు తన కులదైవతమగు విష్ణుని ప్రార్థింపగా ఆ వేల్పు ఆదేశముచే సరస్వతి స్వయంవరానికి వచ్చిన రాజులను దమయంతి కి వర్ణించి చెప్పుటకు స్వయంవర మండపమున అవతరించి -నట్లు గలదు.

శ్రీనాథుని శైలి పద్ధతి ఎంతో మెప్పుదలగా
గాన వచ్చుటచే తర్వాతి ఆ యుగమందలి పినవీరన,
నంది మల్లయ మొదలు కవులందరూ ఆతని అడుగుజాడలందే నడచి
అనువాదాలు చేసిరి. ఇట్టి విలక్షణమైన శైలి
అనువాదవిధానమే కవిసార్వభౌముడు శ్రీనాథుని నవ్యయుగకర్త గా
తీర్చిదిద్దింది / నిలబెట్టింది.

## శ్రీనాథుని కవితా రీతులు

ప్రస్తా → కావ్యయుగనాయకుడైన శ్రీ... పురాణ రచనకు భిన్నమైన కావ్య రచనకు ఆద్యుడై అద్భుతమైన కవితాశైలిని ప్రదర్శించి తరువాత కవులకు మార్గదర్శకుడయ్యాడు.

### శ్రీనాథుని శైలి

ఆంధ్ర సాహిత్య చరిత్రలో క్రీ.శ. 1360 నుండి 1500 వరకు గల కాలాన్ని కావ్యయుగమని పిలుస్తారు. ఈ యుగకర్త శ్రీనాథుడు. ఈశ్వరార్చన కళాశీలుడు, బ్రాహ్మీదత్త వర ప్రసాదుడు అయిన శ్రీనాథుడు బహుగ్రంథకర్త. శృంగారనైషధము, కాశీఖండం, భీమఖండం, హరవిలాసము మొ॥ ముఖ్యమైనవి.

శ్రీనాథుని కవితాశైలిలో ఎందరినో ఆకర్షించినది అతని ధార. "శ్రీనాథుడు రస ప్రసిద్ధ ధారాధుని" అని విశ్వనాథ వ్యాఖ్యానించారు. కవిత్వంలో రసానుకూలంగా పాకాలు, రీతులు, అలంకారాలు, గుణాలు, రీతులు, వృత్తులు. ప్రసిద్ధ కవులు తమ కవితా శైలులలో వీనిలో ఏదో ఒక దానికి ప్రాముఖ్యమిచ్చి తమ ప్రత్యేకతలను నిలుపుకొంటూ ఉంటారు. శ్రీనాథునిది "రసానుగుణ రీతి ప్రధాన శైలి".(1) రసమే శ్రీనాథుని రచనా ధ్యేయం. రీతి అతని మార్గము. రసానుకూలమైన విశిష్టపద రచనా మార్గాన్ని మార్గ కవితకు చూపించి విశిష్ట మార్గాన్ని వెలయించాడు.

కుంతకుడు తన 'వక్రోక్తి జీవితము'న చెప్పిన సుకుమార, విచిత్ర, మధ్యమ మార్గములలో శ్రీనాథునిది విచిత్ర మార్గము(2) శైలి విధానము. ఈ శైలికి వక్రోక్తియే ముఖ్య లక్షణము. దీనికి భీమేశ్వర పురాణములోని క్రింది పద్యము ప్రబల నిదర్శనము.

" హారచూడా హారికాంత వక్రతయు --- "

వక్రోక్తి చమత్కారము, కాఠిన్యయుక్త పద సంయోజనము కలదగుట తన రచనకు సరసత్వము సాధించినదని శ్రీనాథుడు పై పద్యమున సూచించెను. శ్రీనాథుని కవిత్వములోని వక్రోక్తి, ప్రౌఢోక్తి, సరసోక్తి అను మూడు గుణములను విచిత్ర మార్గము నందే గలవు. కుంతకుడు పేర్కొనిన షడ్విధ వక్రోక్తులు శ్రీనాథుని శైలియందు గలవు. వర్ణ విన్యాస వక్రత కు "దేవ బ్రాహ్మణ భక్తి వర్ధిత ---" అనే భీమేశ్వరపురాణం లోని పద్యం ఉదాహరణ.

"దేవ బ్రాహ్మణ భక్తి వర్ధిత ధాత్రీ చక్ర సామ్రాజ్య --"

కాశీ (3) ఖండం లో శ్రీనాథుని కవితా రీతిని వర్ణించు పద్యమొకటి గలదు.

"వచియించెద వేములవాడ భీమన భంగి నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషించెద నన్నయ భట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారంబున రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవించెద ప్రబంధ పరమేశ్వరుని రీతి, సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు"

ఇందు పేర్కొన్న భీమకవి ఉద్దండ లీల, శ్రీనాథుని కాశీఖండము లోని క్రింది పద్యమందు చూడవచ్చు.

"దూర్దండ ఘట్టన త్రుటిత గ్రహగ్రామ ధూళిపాళీమిళద్బ్రహ్మాండములును--"

నన్నయ భట్టు వలె ఉభయ వాక్ప్రౌఢి ని శ్రీనాథుడు గుణనిధి కథ లోని

"అరుణగభస్తి బింబ ముదయాద్రి ----" అనే పద్యంలో

చక్కగా ప్రదర్శించాడు.

ఇట్టి అర్థాను విధి పదబంధ విన్యాసముగ, రసాభ్యుచిత బంధముగ కూర్చు శ్రీనాథుని శైలి కి క్రింది పద్యము ఉదాహరణ. కాశీఖండము లోని గుణనిధి కథ లో యజ్ఞదత్తుడు సోమిదేవమ్మ నుండి ఉంగరం రాబట్టేందుకు చెప్పిన

" అంగోద్వర్తన వేళ నీవు దరహాసాంచయురముల్ లోచనా
పాంగ ప్రాంతములం దిగుర్ప నా సయ్యాటులంబు గల్పించినా
అంగుళ్యాభరణంబు పుచ్చుకొనవా ? ..... " అనే పద్యంలో

కూర్చిన శృంగార రసం సొంపైనది. అలాగే భక్తి ప్రధానంగా సాగే కథలో సైతం చొచ్చుకొని శృంగార రసాన్ని పోషించి అతను రసాభ్యుచిత బంధాన్ని చాటుకున్నాడు శ్రీనాథుడు.

ఇట్టిన విధి సూక్తి వైచిత్రి ని సైతం శ్రీనాథుని రచన లో చూడవచ్చును. విద్యా మీద పద్యం ~~" కందుక గాలి మాటల విరాసము ఉండక __ " అనే హాస్యాలంకారము లోని పద్యము చక్కని ఉదాహరణ.~~

ఆంధ్రమున మొదటి నుండియు ఉభయకవుల సాధించిన కవివర్గ మొకటియు అర్థ గౌరవము ను పాటించిన కవివర్గ మింకొకటియుగా రెండు శాఖలు గలవు. మొదటి మార్గము ప్రారంభించినది [illegible] (4). దాని కి నన్నయ భట్టు ఆది గురువు, నాచన సోమనాథుడు కొంత పరిపోషించెను. ఈ మార్గము శ్రీనాథుని చేతిలో పరిణతి చెందినది.

ఇట్టి నిరుపమాన శయ్యా వైచిత్రి చేతనే చిత్రవిచిత్రాలంకారిక మైన ప్రబంధములకు శ్రీనాథుడే సూత్రధారుడయ్యెను. ప్రబంధకర్తలకు అలంకారిక రీతిని అమూల్య భిక్ష గా పెట్టినవాడు శ్రీనాథుడే. next para

శయ్యా సౌందర్యం + అర్థగౌరవం (5)

శ్రీనాథుని రచనలలో సాధారణంగా శయ్యా సౌందర్యార్థ గౌరవములు రెండును సమ ప్రాధాన్యతనే కలిగియుండును గంభీరములును రమణీయములును అగు అర్థములతో పాటు కఠినములును సరళములునైన శబ్దములను జోడించుకొనుట వచ్చు నేర్పు శ్రీనాథునకు వలెనే తెలుగు కవులలో నెవ్వారికిని కబ్బించదు. అతని వాక్యములకు జిగియు బిగువును రెండూను గలవు. ఆ పద్యాలలో యొరుగు ఉభయ ముఖములలో నుండి సమత యొక్క గుణ ప్రయత్నముగా సిద్ధమయినది. next para

సీసము (6)

ఈ జిగి, బిగువు, యొరుగు, సమత, ఇవి మొదలగు గుణ సముదాయమంతయు సీసమున పరత సిద్ధి పొందినదని చెప్పవచ్చును. సీస పాదోచితములైన ఇంద్రగణాలు లాంటిలో కొన్ని మూడు మాత్రలు గలవి కొన్ని నాలుగు మాత్రలు గలవి. ఆ గణముల పొందిక సమానములగ లేనప్పుడు ఛందస్సు తప్పకున్నను లయ తప్పుట మాత్రము నిజము. యతి స్థానముల కనుగుణముగా లయానుసారము గణములను పొందు కుదిర్చిన మేటి కవి శ్రీనాథుడు.

యతి స్థానమున పదము విరిగినచో తప్ప విశ్రాంతి యనెడి సార్థకతయు నుండదు. లయ శుద్ధి ఏర్పడదు. ధారాశుద్ధి యను నైపుణ్యము తెలుగు కవులలో ప్రాయముగనే విస్తరించెను.

శ్రీనాథుడు మాత్రము తన సీస పద్యములలో నీ శాస్త్రము ను సాధ్యమైనంత వరకు పాటించెను.

శ్రీనాథుని సీస పద్యము నందు ఏ పాదమునకా పాదము నందే పదములు తెగిపోయి "భావ విభజన" కావించును.

"గుణ్ణం సీసాలు"
— సి. నా. రె.

"ధరియింప నేర్చిరి దర్భ పెట్టెడు వ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగ మట్టియ మీద
కస్తూరికా పుండ్రకముల నాసల .."

అను భీమేశ్వర పురాణ పద్యమిందులకు చక్కని ఉదాహరణము.

శ్రీనాథుడు తన శైలిని గూర్చి భీమేశ్వర పురాణములో ఇట్లు చెప్పుచున్నాడు.

"ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాషయండ్రు
ఎవ్వరే మంత్రిగాక నాకేల కొఱత
నా కవిత్వంబు నిజము కర్ణాట(7) భాష"

✓ ఎవ్వరేమన్న నండ్రు నాకేమి కొఱత

ఇందలి 'కర్ణాట భాష' కు ఎవ్వరెన్ని అర్థములు చెప్పినా పింగళి లక్ష్మీకాంతము గారి విశ్లేషణ తగియున్నదనిపించును. పింగళి గారి ననుసరించి కర్ణాట భాష యనగా కర్ణాట శైలి యని యని అర్థము. ఇచట శ్రీనాథుడు భాషా శబ్దము ను లోనే లక్ష్యార్థము లోనే

వాడెను గాని వ్యాఖ్యార్థముల కాదు. ప్రత్యేకముగా సాంప్రదాయికము ను గాని దేశి ని గాని చేపట్టక, రెండిటి సారము ను గ్రహించుకొని చెవికి ఇంపును మనస్సునకు హాయిని కలిగించెడి శైలి ని శ్రీనాథుడు తెలుగు భాషలో అవతరింపజేసెను. ఆ శైలినే అతడు సంగీత నాట్య పరిభాషానుసారముగా 'కర్ణాట భాష' గా పేర్కొనెను.

పద్య[1] శిల్పము లో భాషా[2] బంధముల నాద సౌష్ఠవము[3]లో శ్రీనాథుని నన్నయ పీఠమెక్కించింది. ఒకే ఒక భావము ను[4] పద్యములో చెప్పుటలో శ్రీనాథుడు

(8)

సమర్థుడు. ఉదాత్త సౌందర్యము ను చిత్రించదలచినపుడు అతడు సమాసము[5]లో పద్యము నడిపించును. ఒక సత్యము గాని సందేశము గాని ప్రవచింప దలచినపుడు స్థిమితమగు[6] పద్యము ను నడుపును. ఇది శ్రీనాథుని తనము. శృంగార శైవ ధర్మముల ఉద్దండ శైలి, హర విలాస భీమేశ్వర పురాణము లో కల్పనా శైలి లో, కాశీ ఖండము లో అర్థ పుష్టి, ప్రబంధ దృష్టి గోచరించును.

ఇట్లు శ్రీనాథుని కావ్యశైలి అసాధారణ శయ్యా సౌభాగ్య సమవేతమై తదనంతర ఆంధ్ర కవులకనేకులకాదర్శమైన ప్రబంధ శయ్యకు మార్గదర్శకమై శోభిస్తుంది.

పదపూర్వార్ధ వక్రత
గృహభర్త
అలంకార వక్రత
" అష్టదిగ్గజాలట..

## వక్రోక్తి కి ఉదాహరణ :

" అంగద్వారంన వేళ నీవు .... " అనే పద్యం లో

మూలం లో యజ్ఞదత్తుడు ఉంగరం ఇవ్వమని సామిదేవమ్మ ను సూటి గా అడిగినట్లు ఉండగా శ్రీనాథుడు వక్రోక్తి ని కల్పించి ఈనాడా యుంగరము తొడుగుతి ఓ చేతితో అగ్నిదేవునకు నేను హవి: ప్రదానము చేసెదను, అని పరోక్షం గా ఉంగరం అడిగిన తీరు ను రమణీయంగా చిత్రించారు.

## ఉద్దండ లీల కు ఉదాహరణ :

" ఘుసృణ కుసుమమాలికోటి పాటల్య లీలన ... "

## ఉభయవాక్ప్రౌఢి కి ఉదాహరణ :

" అరుణ గభస్తి బింబ ముదయాద్రి పయిండ బొడ తేర గిన్నెలో పెరుగును .. " అనే పద్యం లో అరుణగభస్తిబింబ, ఉదయాద్రి, వారవార, విపులత మొ॥ పదాలు తత్సమాలు కాగా గిన్నె, పెరుగు, వడ పిండియలు మొ॥ దేశీయ పదాలు.

## రసాభ్యుచిత బంధము : " లక్ష్మీక్రీడాభూములు మనంబున నుప్పతిల్లగ "

" అంగద్వారంన వేళ నీవు దరహాసాంకురమ్ముల్ లోచనా
పాంగ ప్రాంతములం దిగుడ్డ నొక్క సంధ్యారుణంబు గల్పించి -- "

## సూక్తి వైచిత్రి :

గుణనిధి కథ లో శివ ధర్మానికి చెందిన సూక్ష్మధర్మ

సూక్తులను చక్కగా వెలయించాడు.

"ఆచారం బడి యుండగ, న
నాచారం బడియుండగ నజునకునైనన
గోచరము కాదు శివ ధ
ర్మాచారము సూక్ష్మ సూక్ష్మతరమై వర్తిల్లున్"

పశ్చాత్తాప పడుతున్న గుణనిధి విద్య గురించి చెప్పే పద్యం

"ఏ భయంబును నైజంబు నేనయితేదు
నరుక కెప్పటు విద్యాధనంబు ధనము
చోర బాధాదికములచే జూటువోవ్వ
ధనము ధనమౌనె యున్న చందములఁ దలఁప!"

శ్రీనాథుని సూక్తి వైచిత్రికి చక్కని తార్కాణము.

వర్ణనలు

"కావ్యాన్ని కథకోసం కంటె వర్ణన కోసం వ్రాయాలి" అనే ఉద్యమాన్ని తెలుగు సాహిత్యంలో బలంగా స్థాపించింది శ్రీనాథుడే. అయితే, వర్ణనలను కథార్థంలో ~~అవసరంగా~~, ~~అనవసరంగా~~ పెంచే పద్ధతినే అతడు చాలా వరకు అనుసరించాడు. కాని చాటుకవితా ప్రవృత్తి సహజంగా ఉన్న ఇతడు కావ్య రచనలో కూడా వర్ణనలలో చాటువుల స్ఫూర్తిని అభిప్రాయాభివ్యక్తిని ప్రదర్శిస్తూ ఉంటాడు. ఇది క్రమంగా తరువాతి యుగాల్లో ప్రబంధ చమత్కారాలకు బాటలు వేసింది.

ప్రబంధలక్షణాలు గా చెప్పే జాతివార్తాచమత్కారాలు శ్రీనాథుని రచనల్లో కన్పిస్తాయి. ఉదా: గుణనిధి కథ లో నాటి వంటకాలు

ప్రబంధ లక్షణాలు గా చెప్పబడే జాతి వార్త
చమత్కారాలు శ్రీనాథుని రచనల్లో కనిపిస్తాయి.
ఉదాహరణకు గుణనిధి కధ లో

" మిరియ ధూళిపాళి పరిచితంబుల --- " అనే
సీస పద్యంలో చేయబడిన అప్పడాల రుచుల కు లక్షణాలున్న
వంటకాల వర్ణన 'వార్త' ను పోషిస్తోంది.

శ్రీనాథుని రచనలలో నాటకీయత సైతం తొంగిచూస్తోంది.
గుణనిధి గర్భగుడి లో ఉన్న వంటకాలను తినాలన్న ఆలోచనతో
అందరూ నిద్రించిన సమయంలో ఏ విధంగా చప్పుడు చేయకుండా లోనికి
ప్రవేశించాడో వర్ణించే సీస పద్యం ఇందుకు నిలువెత్తు సాక్ష్యం.

" కట్టాయితంబు గా గటి మండలంబునం
బట్ట దట్టి చేల దిండు గట్టి
తలుపు కిట్టినకుండ ---- " అంటూ సాగే
ఈ పద్యం 'గుణనిధి' సినిమా చూస్తున్నట్లే అనుభూతి కలిగిస్తోంది.

జాతి – సమకాలీన వాస్తవ వర్ణన ( స్వభావోక్తి )
ఉదా: పల్నాటి సీమ

వార్త – గుణనిధి : వంటకాలు

చమత్కారం – " సిరిగలవానికి చెల్లును ... "

# తిక్కన – నాటకీయత

ఆంధ్ర సాహిత్య చరిత్ర లో క్రీ.శ 1225 నుంచి 1320 వరకు గల కాలాన్ని తిక్కన యుగము గా పేర్కొంటారు. కవిత్రయం లో ద్వితీయుడయ్యును అద్వితీయుడైన తిక్కన 13 వ శతాబ్దానికి చెందిన వాడు. ఆంధ్ర మహా భారతం లోని పదిహేను పర్వములతో పాటు నిర్వచనోత్తర రామాయణము ను కూడా వ్రాసెను. ఇతడు నెల్లూరు ప్రభువు మనుమసిద్ధి కి మహా మంత్రి. ఖడ్గ శూరుడు, ధర్మైకదృష్టి యైన ఆచార్య పురుషుడు, తత్త్వజ్ఞాన సంపన్నుడు అయిన తిక్కన 'మనుమ సిద్ధి రాజ్య స్థాపనాచార్య', 'ఉభయకవి మిత్ర', 'కవిబ్రహ్మ' గా కీర్తి కెక్కాడు. ఇతడు హరిహరాద్వైతాన్ని ప్రతిపాదించిన ధర్మమూర్తి, భక్తి సంపన్నుడు, శాంతి కాముకుడు.

'ఆంధ్రావళి మోదంబారయునట్లు' గా భారతాన్ని చెప్పిన తిక్కన నన్నయ కథాకథన శైలి కి భిన్నమైన దానిని అవలంబించాడు. కావ్య సామాన్య సరణి యనే సాహిత్య శైలి లోని ఆఖ్యాన, నాటకీయ, వర్ణనాత్మకములలో తిక్కనది నాటకీయశైలి. అట్లే పదగుంభన సరణి యనే సాహిత్య శైలి లోని బుద్ధిగమ్య, భావస్ఫురక, కర్ణపేయములనెడి మూడు భేదములలో తిక్కనది బుద్ధిగమ్యము.

ఏ కథయైనను సంభాషణ రూపమునకున్నప్పుడు నాటకీయ మనిపించు కొనును. కాని సంవాదమే నాటకీయత కాదు, అది నాటకీయతలో

(1) 'వీర రస మయాత్మకు' ఉయ్యాలస్త 'రౌద్రరస ప్రసాది' యైనా' ఉన్నా 'సాత్విక రసాలు', 'హాస్య రసాలు' ఎన్నిటిని చెప్పినా అవి కావ్యశాస్త్ర మర్యాదలలోని రసాలు కావు, నృత్య నాట్య మర్యాదలకు చెందినవి. మరొక శాస్త్ర మర్యాదను సాహిత్యంలో పారిభాషిక స్థాయిలో ప్రవేశపెట్టటం వలన కావ్యశాస్త్రానికి విస్తృతి కలుగుతుందని, తన రచనలో పాత్రల మానసికావస్థలను పాఠకులు గ్రహించటానికి సౌలభ్యం ఏర్పడుతుందని తిక్కన భావించాడు. ఇది ఆతని నాటకీయతను దృష్టిని చెప్పుచున్నది.

(2) మనస్తత్వవేది యగు తిక్కన సాత్త్విక, వ్యభిచారి ఇత్యాది సకల విధ భావములను వర్ణించి పాత్రల మూర్తులను రూపుకట్టించును. ముఖ్యముగ, కీచకుడు ద్రౌపదిని చూచిన సందర్భములో భయాది భావములతో కంపించిన ద్రౌపదిని

" వెలవెలనై నను జూచె వీడని యెదగలు పొంచిన నాండొండ చెమటువాడమ ---- వెల్లదనంబు గదుర " పద్యంలో

నిల్పిన తీరు నిదర్శనము. అట్లే కౌరవ సైన్యము చూచి భీతి పొందిన ఉత్తరుని మూర్తిని తిక్కన

" వెలవెల బారుచు వెగడొందు బెదవుల తడియారి--- "

పద్యంలో వర్ణించినప్పుడు 'సినిమా' చూసినట్లే ఉంటుంది.

"...సమస్త పరిజనంబులుం పరివేష్టింప, నార్య...

పార్శ్వంబునం బాంచాలియు నవయువతీ పరివార

పరివృత్తయై యుండ..." వంటి నాటక[3] రంగ వర్ణనలుంటాయి.

తిక్కన కావ్యస్వర కౌశలానికి ఉద్యోగ పర్వంలో ద్రౌపది పలికిన "ఏనిటులంటి --- చేయుడు నేర్పు తోర్పడన్" అనే పద్యం నిదర్శనము.

నిర్వచనోత్తర రామాయణాదుల ప్రాయ నాటికి తిక్కన నాటకీయత యందు నేర్పు చూపాడు. పాత్రల ప్రవేశ నిష్క్రమణాలు, స్థలకాల భేదాలు, భూనేత్ర కర్మ భేదాలు, వాక్య భేదాలు మున్నగు నాట్య[6] సంకేతాలు (ఆలాప భేదాలు కూడా) ఈ గ్రంథమందంతటా నిండుగా ఉన్నది. పరిత్యాగ కారణాలను లక్ష్మణ ముఖముగా విన్న సీత చిత్తవృత్తిని

"పడి మూర్ఛిల్లి ముహూర్తమాత్ర, మడికిం దెలివొంది బాష్పవారి ---" అనే సీస పద్యంలో శుద్ధ శోక మూర్తాభినయంలో కళ్ళముందుంచుతాడు.

తెలుగు భారతంలో తిక్కన పాత్రల[5] వ్యక్తిత్వాలు[1] భిన్నత్వాలు[2], అభివ్యక్తిలో పాత్రల మధ్య అంతరత్వం[3] చక్కగా చూపించాడు. ఉదా: ఉద్యోగ పర్వంలో పాండవులకు కృష్ణునికి జరిగే సంభాషణలు నిదర్శనాలు.

" రాక్షస మాటలాడెదరు రాజును దమ్ములు ___ "

అనే పద్యంలో సహా దేవుని మాటలు పాత్రోచితములై ఆ పాత్ర స్వభావాన్ని వెల్లడిస్తాయి. ఆవేశం నిండినప్పుడు ఉన్నదున్నట్లు కుండబద్దలుకొట్టి చెప్పేవాడు అన్నల రాజరికం అంటుచిక్కని అడవికి

" ___ మొదలుగా ననేకులనేక ప్రకారంబుల వీరాలాపంబుల గొలువెల్ల నార్వ మోయగా " అంటూ కొలువైన(6) విషయాన్ని కూడా వర్ణించి రక్తి కట్టిస్తాడు.

కథలోని పాత్రల చేతనే ఒక పాత్ర గురించి మరొక(7) పాత్ర చేత చెప్పిస్తాడు. ఇది తిక్కన నాటకీయతలో ప్రధాన లక్షణము. ఇందుకు ఉద్యోగ పర్వం లో భీముడు కృష్ణునికి దుర్యోధనుడి గూర్చి చెప్పిన పద్యం

" పాపాత్ముండు మదాంధుడా కులువ ___ " అనే పద్యం నిదర్శనము.

~~[struck-out lines]~~

తిక్కన పాత్రల సంభాషణలు సరళముగా, సూటిగ నుండి పాత్రల మనోవృత్తులను నిరూపించుచు నుండును. ఈ సంభాషణల్లో ఒకరి మాటలకు మరొకరి మాటలు ఆధారమౌతాయి.(8) ఉదాహరణకు భీముడు " __ సంధి సేయు వలయుం దగ __ " అని కృష్ణునితో సంధి చేసుకుందామని అన్నప్పుడు సమాధానంగా కృష్ణుడు

" యుద్ధము మాని వేడ్కయు ...

___

పలుకులు యెప్పునే కీచకాంతకా! " అనే పద్యంలో

భారతము అసంఖ్యాక పాత్రలతో నడిచెడి అతి విస్తృతి గల వస్తు ప్రపంచము. విపులతరమైన వస్తు ప్రపంచములో సూక్ష్మ వివరణములు కవి భావనను తప్పించుకొని పోవుట సహజము. కాని తిక్కన భారతములో అట్టి సూక్ష్మ వివరణము(11) ఏమాత్రమును జరుగలేదనుటకు గ్రంథమంతా ఉదాహరణమే. ముఖ్యము ద్రౌపది సైరంధ్రీ వేషమున విరాట పురము జొచ్చునప్పుడు సైరంధ్రీ జాతి వేషమున కూర్చుమానమ్ము "వల్లెవాటు దిక్కున కొంగు మెలిగొనటము" చెప్పు పెట్టి కొన్నదట.
ఇటువంటి సూక్ష్మ వివరణాలు నాటకీయతా గాఢతనే పెంచుతాయి.

ఇవేకాక తిక్కన రచనలో సంభాషణల్లో "మనుజాధీశా!" "ధర్మ ప్రవీణ హృదయా!" "మహాత్మా" వంటి సంబోధనలుంటాయి.(12)

ఎదురుగా ఉండి మాట్లాడుతున్నట్లు అనిపించే "సంజయ, పద్మపాలిత వృత్తి విడువుమా" వంటి పంక్తులుంటాయి.
"అయ్యోభయము జాగు చేయుండ"
"ఓ రాజనుమా దేవం", "ఇట్లు పురాతన",
"వినికవుములు" అనే విధంగా నిర్దేశ వాచకాలను ప్రయోగించడం తిక్కన నాటకీయత.

మధ్య మధ్యలో "సంజయ మోముచూచి యిట్లను" "చిన్న నవ్వు నవ్వి" అని అభినయ వర్ణన చేస్తాడు.

"అమ్మను చెప్పరునకు నేమమ్మె ?", "నిన్ను నిట్టన వచ్చునే?"...

వంటి ప్రశ్నార్థక వాక్యాలు నాటకీయతకి బలం చేకూరుస్తాయి.

యుద్ధవర్ణనలో "చెరి కర్ణ", "ఓయోయి నిలు నిలుము" వంటి వాటి వల్ల ఆ దృశ్యం సాక్షాత్కరిస్తుంది.

నాటకీయత ఉత్పన్నమయేటట్లు ఆహార్య, ఆంగిక అభినయ(13) వర్ణనలు చేయడంలో తిక్కన దిట్ట. ఉద్యోగపర్వం లో సంధికోసం పాండవుల యత్నాలు విని బాధావేశంతో 'దిగ్గన లేచి' న ద్రౌపది ఆంగికాభినయాన్ని సాత్త్విక భావాల్ని

"ద్రౌపది బంధురంబయిన క్రొమ్ముడి (గ్రమ్మన విడ్చి) ---
— — — - - దిగ్గన లేచి యుగ్రయై" అనే

పద్యం రూపు కట్టిస్తుంది.

పాత్రల ప్రవేశ నిష్క్రమణాలు, స్థలి గతులు, స్థల కాల వివరాలు, సన్నివేశ- పాత్రోచిత సంభాషణలు, సజీవ పాత్ర సృష్టి, పాత్రల అవయవ విక్షేపణల ప్రదర్శన, జనాంతిక స్వగతాలు, ఆహార్య ఆంగికాభినయ వర్ణనలు, సకల భావములు/సకల విధ భావముల వర్ణనలు కలసిన తిక్కన నాటకీయత కేవలి పాత్రల మనోధర్మ పరిశీలనలో కొనదేరి ఆయన గల ప్రతిభ నాటక కర్తలకే చాల
ఇక తృణ కావ్యకర్తల సంగతి చెప్పనేల?
మందికి తోడు పించును. ఎర్రన చెప్పినట్లు

'తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదు'.

ఉద్యోగ పర్వం లో కృష్ణుడు భీమ సేనుని కౌరవుల తోడి యుద్ధమునకు పురికొల్పుటకై ప్రారంభించిన సందర్భంలో

" అని సహోదరు లాజి నాయామనపడుటు

— — —

— — — .

పవనజు (పురికొల్ప నాంతర్గ దలచి " అని

పద్యం ద్వారా తిక్కన 'జనాంతిక స్వగతాన్ని' వెల్లడించి నాటకీయతను పోషించాడు.

జనాంతిక స్వగతము

ద్రౌపది కీచకుని వల్ల తాను పడిన భంగపాటును భీముని కెరింగించునదియై రాత్రి వేళ మహానసమందు నిద్రలోనున్న భీముని మెల్లగా సంబోధించెనట. పాంచాలి వాని స్పర్శించుచు మేల్కొని "ఎవ్వరిది!" యనెనట. ఆమె 'నేను' అని బదులు చెప్పినదట. ఆ యెలుంగును బట్టి అతడామెను ద్రౌపదిగా గ్రహించి 'యాజ్ఞసేని కీచకు దురాచరణంబు నాకు ప్రకటించి, వాని నిర్జింప నియోగించునదియై యరుగ దెంచెం గావలయు! ఇత్తెరంగు ఇత్తెఱవ లోన చెప్ప విందు" నని తలంచెనట.

ఈ ఉదాహరణలో వరుసగా కన్పించే ఇట్టి శారీరక చేష్టలు(14), వాచిక కాకువులు,

ఈ ఇది రెండో యాంగి

జనాంతిక స్వగతములు నాటక ప్రదర్శనలోన నటులు చేసెడి అభినయ విశేషములు. వాటిని కూడ కథా విషయమున ఇముడ్చుటచే కావ్యము ప్రత్యక్షత కల్పితమైనది.

[నిర్వచనోత్తర రామాయణం లో లోపించిన

సీతారామలక్ష్మణుల పాత్రల చిత్రణలో వివర్తనములు

" అక్కట ! నాదు వేడ్క --- రథంబు లతాంగి యెక్కినన్ "

" ఉత్తరీ మున్ను ధైర్యమున --- జూచి యుల్లమున్ "

" దూరముల నాఁ ------ యుల్లిని నీను బుద్ధులు కల్గినవాడు నూచెదే

అన్ని పద్యాలలో ప్రదర్శించి చూపిన ఆ నేర్పు నాటక కర్తలకే కాదు, నాటకములన్నిటియందు నాటకులకును నాంధ్రములగందు. అందును లక్ష్మణుని మనోవైకల్యం గమనించి, రాముడు దాని కథలు చెప్పుట (15) పాత్రపాత్రమైన పాత్ర యొక్క చేష్టను కథాంశముతో మేళవించుట అనేది ఒక నాటకీయ ధర్మమును దృష్టాంతము.

~~ఇట్టి ప్రజ్ఞ షేక్స్పియర్ నాటకములలో పెక్కుచోట్ల కానవచ్చును. లోపించిన కావ్యము ను నాటకీయంగా రచించునను సిద్ధాంతమునకు ఇటువంటి ఉదాహరణములు పెక్కు చూపవచ్చును.~~

~~ఇట్టి ప్రజ్ఞ షేక్స్పియర్ నాటకములలోనే గాని కానరాదు/ సాధారణంగా కానరాదు.~~

~~ఇట్టి ప్రజ్ఞ షేక్స్పియర్ నాటకములలో మాత్రమే లేను చూసినట్లు పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పిరి.~~

Add

తిక్కన కథను తానుగా చెప్పినట్లు గాక నాటకము నందు వలె పాత్రలో మన ఎదుట నిలబడి(16) వ్యవహరించినట్లు వారి మనోవృత్తులు భావవికారములు అభినయ వర్ణన మూలమున మూర్తిభవించినట్లు రచించినాడు.

తిక్కన నాటకీయత కేవలము కథను సంభాషణా రూపమున నడుపుటలో నుండదు. నాటకములో నుండెడు సంధిబంధములను(17) దృష్టి నుంచుకొని సన్నివేశములను కల్పించి అందులోని పాత్రల మనో ~~[illegible]~~ను / మనోవికారాదులను చిత్రించుటలో నుండును.

~~వ్యంగ్యం : సంజయుడు ధర్మరాజుతో క్షేమసమాచారాలు మాట్లాడునప్పుడు ధర్మజుడు పలికిన " ఆ రాజును మా దేశంగల " ఆ రాజును మా దేశంగల ------" అని చెప్పిన సమాధానాలు లోని [illegible] అసామాన్యమైనది. ఈ మాటలు 'పైకి సాధారణంగా అమాయకంగా కన్పించినా లోపల లోపాలి గుండెను దొలచునట్టివి' అని సి.నా.రె. గారన్నారు.~~

# Plot of the answer

→ Introduction

→ తిక్కన శైలి ఏది

→ నాటకీయత అంటే ఏమిటి

→ తిక్కన నాటకీయత ఎలాంటిది

→ తిక్కన నాటకీయతలోని వివిధాంశాలు

- పారిభాషిక పద కల్పన
  నాట్యశాస్త్ర 'రస' సాయంతో కావ్యకళకు విస్తృతి
- సకల విధ భావాల వర్ణన (సాత్త్వికాది భావాలు)
- నాటకంలో వలె రంగ వర్ణన
- కాకుస్వర కౌశలంచే వాచికాభినయనము
- నాట్య సామాగ్రిని నాటకీయతకు వాడుకొనడం
- పాత్రల వ్యక్తిత్వము
- కొలువు లోని జనాంతిక భావాల వెల్లడి
- ఒక పాత్రచే మరొక పాత్ర గురించి చెప్పించడం
- ఒకరి మాటలు మరొకరి మాటలకు ఆధారమవ్వడం
  — సంభాషణా శిల్ప సౌందర్యం
- మానసిక తత్త్వ వివరణ
- దృశ్య సంక్షోభాత్మక పద్ధతి — పాత్ర ఆధారంగా రసపోషణ
- సూక్ష్మ విస్తరణము జరుగకుండుట
- సంబోధనలు, నిర్దేశక వాచకాలు, ప్రశ్నార్థక వాక్యాలు మొ॥

14 • ఆహార్య, ఆంగిక, అభినయ వర్ణనలు

→ ముగింపు

స్వభావ వర్ణన ఇందుకు నిదర్శనం.

4) నాట్య సామగ్రిని విరివిగా వాడుకోవడం :

నిర్వచనోత్తర రామాయణం తీసుకుంటే తిక్కన నాటకీయతలో నేర్పు చూపాడు. పాత్రల ప్రవేశ నిష్క్రమణాలు, స్థలకాల భేదాలు, భ్రూనేత్ర వక్త్ర భేదాలు, హాస్య భేదాలు మొదలగు నాట్యసామగ్రి, (ఆలంబన భేదాలతో సహా) ఇలాం ఈ గ్రంథమందంతా నిండుగా ఉంది.

# Plot of the Answer

Introduction

తిక్కన శైలి ఏది ?

నాటకీయత అంటే ఏమిటి ?

తిక్కన నాటకీయత ఎలాంటిది ?

తిక్కన నాటకీయత లోని వివిధాంశాలు :

1) సంభాషణ పద కల్పన – నాట్యశాస్త్ర "రస" సంయుక్త కావ్యాంశాల విస్తరణ
2) పలు విధ భావాల వర్ణన (శృంగారాది భావాలు)
3) నాటకంలో వలె రంగ వర్ణన
4) కాకుస్వర భేదాలచే వాచికాభినయము
5) నాట్యసామగ్రిని నాటకీయతకు వాడుకొనడం
6) పాత్రల వ్యక్తిత్వము
7) కొలువులని కూరిచిన భావాల వెల్లడి
8) ఒక పాత్ర చే మరొక పాత్ర గురించి చెప్పించడం
9) ఒకరి మాటలు మరొకరి మాటలకు ఆధారమవ్వడం
   — సంభాషణా శిల్ప సౌందర్యం
10) మానసిక తత్త్వ వివరణ
11) దృశ్య సాక్షాత్కార పద్ధతి – పాత్ర ఆధారంగా రస పోషణ
12) సుదీర్ఘ విస్తరణ జరగకుండా ఉండడం
13) సంబోధనలు, నిర్దేశక వాక్యాలు, ప్రశ్నార్థక ~~[illegible]~~ ద్యోతకాలు
14) ఆహార్య, ఆంగిక, అభినయ వర్ణనలు

ముగింపు --

Statement of Reports generated Category wise and Wing - Wise from 2000 to 2004 (31-12-2004)

| Sl.No. | Category | Wing | 2000 | 2001 | 2002 | 2003 | 2004 | Total |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | Vigilance Report | Development | 61 | 50 | 58 | 50 | 76 | **295** |
| | | Engineering | 84 | 72 | 45 | 65 | 45 | **311** |
| | | NR | 12 | 21 | 34 | 23 | 21 | **111** |
| | | Revenue | 3 | 2 | | 3 | | **8** |
| | | **Total** | **160** | **145** | **137** | **141** | **142** | **725** |
| 2 | Appraisal Report | Development | 24 | 41 | 30 | 62 | 72 | **229** |
| | | Engineering | 7 | 33 | 82 | 86 | 54 | **262** |
| | | NR | 2 | | 2 | 6 | 17 | **27** |
| | | Revenue | | 1 | 7 | | 1 | **9** |
| | | **Total** | **33** | **75** | **121** | **154** | **144** | **527** |
| 3 | Alert Note | Development | 27 | 17 | 30 | 30 | 70 | **174** |
| | | Engineering | 8 | 15 | 37 | 46 | 12 | **118** |
| | | NR | 1 | 8 | 6 | 6 | 4 | **25** |
| | | Revenue | 4 | 2 | 17 | 9 | 45 | **77** |
| | | **Total** | **40** | **42** | **90** | **91** | **131** | **394** |
| 4 | System Improvement Note | Development | | 1 | 4 | 2 | 4 | **11** |
| | | Engineering | 5 | 7 | 4 | | 2 | **18** |
| | | NR | | | 7 | | 2 | **9** |
| | | Revenue | 4 | 3 | | 1 | 4 | **12** |
| | | **Total** | **9** | **11** | **15** | **3** | **12** | **50** |
| 5 | Circulation Note | Development | 15 | 52 | 39 | 4 | 1 | **111** |
| | | Engineering | 2 | 11 | 2 | | 1 | **16** |
| | | NR | 8 | 8 | | 1 | 5 | **22** |
| | | Revenue | 3 | | | | | **3** |
| | | **Total** | **28** | **71** | **41** | **5** | **7** | **152** |
| 6 | U.O. Note | Development | 6 | 4 | 12 | 18 | 21 | **61** |
| | | Engineering | 8 | 2 | 12 | 17 | 26 | **65** |
| | | NR | | 2 | 1 | 1 | 10 | **14** |
| | | Revenue | 3 | | | | 1 | **4** |
| | | **Total** | **17** | **8** | **25** | **36** | **58** | **144** |
| | | **Grand Total** | **287** | **352** | **429** | **430** | **494** | **1992** |

ప్రౌఢి = నైపుణ్యం

# తిక్కన కవితారీతులు / కవిత్వ ప్రౌఢి

తెలుగు సాహిత్య చరిత్రలో క్రీ.శ. 1225 నుండి 1320 మధ్య కాలాన్ని తిక్కన యుగంగా పేర్కొంటారు. ఈ యుగకర్త తిక్కన నెల్లూరు ప్రభువు మనుమసిద్ధి కి ఆస్థాన మహామంత్రి. ఇతడు భారతమున పదిహేను పర్వాలను తెనిగించుటయే గాక నిర్వచనోత్తర రామాయణము కూడా రాశారు. ఇతడు 'మనుమసిద్ధి రాజ్య స్థాపనాచార్యుడు', 'ఉభయకవిమిత్రు', 'కవిబ్రహ్మ' గా కీర్తి పొందాడు.

Intro

'ఆంధ్రావళి మోదము బొరయునట్లుగ' భారతాన్నందించిన (భారతానువాదము గావించిన) తిక్కన కవితారీతులను క్రింది విధముగ పరిశీలించవచ్చు.

1) రసాభ్యుచిత బంధము: తిక్కన రచనలో కానవచ్చే 'రౌద్ర రస విస్ఫురితమైన' 'వీరరసమయోత్సాహుడగుచున్' ఇత్యాదులందలి రస శబ్దము కేవల నవరసబంధముగా కొందరు, అర్థ/భావము అర్థమని కొందరు, అనంతా వైరసాః అనేవారు కొందరు గలరు. అయితే ఇక్కడ (రసశబ్దం) రస భావాదులను తెలిపే వాచ్యం చేస్తుందని, ఈ రసశబ్దం నాట్యమర్యాదకు చెందిందని, కావ్యశాస్త్ర మర్యాదలోని రస శబ్దం కాదని జి.వి. సుబ్రహ్మణ్యం గారు వివరించారు. తిక్కన రచనలో శబ్దాలు అర్థ సమర్పణం చేసి, తమ బంధ ప్రాముఖ్యాన్ని రసం కోసం త్యాగం

చేస్తాయి, రసాభ్యుచిత బంధమిటువంటిదేనని సుబ్రహ్మణ్యంగారు వివరించారు. రసం + ఔచిత్యం క్షేమేంద్రుడు ఆనందవర్ధనుడు

తిక్కన యుద్ధ ఘట్టాలలో రౌద్ర, వీర, భయానక, భీభత్స రసాలను, స్త్రీ పర్వంలో కరుణారసాన్ని, ఉత్తరాభిమన్యుల వివాహ సన్నివేశంలో శృంగార రసం, ఉత్తరుడు కౌరవ సేనను చూసి పారిపోయినపుడు హాస్యరసం తిక్కనగారు చక్కగా పోషించాడు.

"రసుల దయ్యమెఱుగ ---"

"వెలవెల బాఱుచు వెఱగందు --" పద్యాలలో; ఉత్తరుని భీతి హాస్యరసాన్ని పండించింది.

తిక్కన ఒక ~~రసమును~~ రస విషయమును వర్ణించునపుడు ఆ రసాంగములన్నిటిని ఒక ఆకార విశేషము నందు పొందుపరచి ఆ రస స్వరూపమును ప్రదర్శింపచేయును. మచ్చుకు,

"కనుగొని కోపవేగమున గన్నుల నిప్పులు రాల --"

అనే పద్యం భీముని రౌద్రరస మూర్తిని ప్రత్యక్షము చేయును.

2) నాటకీయత: తిక్కన కథను తాను చెప్పినట్లుగాక నాటకంలో పాత్రలే మన ఎదుట నిలబడి వ్యవహరించినట్లు వారి మనోవృత్తులను భావవికారములు అభినయ వర్ణన మూలమున మూర్తిభవించినట్లు చూపును.

తిక్కన నాటకము నందు వలె రంగప్రసాదనమును, అభినయ సూచనను, జనాంతిక స్వగతమును, పాత్ర ప్రవేశ నిష్క్రమణాదుల, పాత్రల సాత్త్విక వ్యభిచారాది సకల విధ భావములను, పాత్రల అవయవ విక్షేపములను నైపుణ్యము ప్రదర్శించి భారతము కథను చదువుతున్నట్లు

'ఔచిత్యం రస సిద్ధస్య, స్థిరం కావ్య జీవితం' — క్షేమేంద్రుడు

'అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్య కారణం' — ఆనందవర్ధనుడు

గాక నాటకీయత చూస్తున్నట్లే అనుభూతినిచ్చునట్లు మలచెను. 
గాత్ర స్వర కాకువులను, శబ్దాల యొక్క శైలిని వాడి చూపిన
దిట్ట తిక్కన.

తిక్కన సంభాషణా చాతుర్యమునకు, పాత్రల వ్యక్తిత్వ
చిత్రణకు సంజయ, శ్రీకృష్ణ రాయబార ఘట్టాలు నిలువుటద్దాలు.

ఒక పాత్ర చే వేరొక పాత్ర స్వభావము ను చెప్పించుట
తిక్కన విశేషము. అందుకు భీముడు కృష్ణునికి దుర్యోధనుని
గూర్చి చెప్పిన

" పాపాత్ముండు మదాంధుడా తులువ ---- "

అనే పద్యం నిదర్శనము.

'మనుజాధమా!' వంటి సంబోధనలు, 'ఇట్లున్నారము'
'వీరెవ్వరెవరు' వంటి నిర్దేశవాచకాలు, 'అన్నను జేర్పరనకు నీవనమ్మె?'
'నిన్ను నిట్టున వచ్చునే?' వంటి ప్రశ్నార్థక వాక్యాలు నాటకీయతకు
బలం చేకూరుస్తాయి.

కీచక వధ ఘట్టంలో భీముని రౌద్ర్యం చాటేవి
'కనుగొని కోప వేగమున ----'
'నేలయునింగియు దాకొనులుగా ---' వంటి పద్యాలు
దృశ్య సాక్షాత్కార పద్ధతికి అట్లే ఉద్యోగ పర్వంలో ద్రౌపది
పలికిన
'అంతయు నీకే తెలదచే అయ్యెటు! -----'
పద్యం వ్యంగ్యానికి
'ద్రౌపది బంధురంబయిన కొప్పుముడి గ్రక్కున విప్పి ---'

[illegible]
తిరిగి కాబట్టి నయానికి చక్కని ఉదాహరణలు.

3) పాత్ర పోషణ: నాటకీయతకి పాత్ర సృష్టి ప్రాణం తిక్కన ఎన్నిక చేసిన పాత్రలు సజీవములు, ~~[illegible]~~ ఉండునట్లు చిత్రించెను. ఏ కష్టాలనుండి మనలు భారతమును పరిశీలించిన ఆ కష్టమునుండియే ఆయా పాత్రలు మనకు సాక్షాత్కరించుట మహోత్కృష్ట విషయము. చిగిన కొలది లోతు తెలియునట్లు తరచి చూచిన కొలది పాత్రల మహత్త్వము బోధపడును.

" ఇది దుస్ససేను వ్రేళ్ళం దవిలి సగము ద్రెవ్విపోయి తిక్కన ---" కేశములను చూపు ద్రౌపది అభిమానవంతురాలు. తిక్కన ధర్మరాజు మెత్తని పులి. భీముడు ఆవేశం తప్ప ఆలోచన లేనివాడు కాడు వ్యాస పాత్రలకి తెలుగుదనం అద్ది వాటిని చిరస్థాయి గావించాడు.

4) వర్ణనా నైపుణ్యం: తిక్కన వర్ణనలు సందర్భశుద్ధి కలిగి, రసానుగుణములై, దృశ్య సాక్షాత్కారమును గావించును. జడత్వమునకు చేతనత్వమును ఆపాదించుట, మానవుల బాహ్య రూపములనే గాక అంతర్వృత్తులను (భావ వర్ణన) వర్ణించుట, స్త్రీలను నిశ్చల స్త్రీలను గాక వారు నడచునప్పుడు, నవ్వినప్పుడు, పలుకునప్పుడు సౌందర్యమును విశిష్టంగా వర్ణించుట తిక్కన విశేషాలు.

అజ్ఞాతవాసములో వంటవానిగా వచ్చు భీముని రూపాన్ని

" చట్టువంబాక చేత బట్టి ---" పద్యంలో సాక్షాత్కరించాడు.

కల్యాణి శవ వర్ణన చేయు

" బోరగిల బడ్డ వాడు గవాల మోకటి

— — —

— — — —

జిహ్వాదినియెడ వాయస శ్రేణి కృష్ణ!" పద్యం

శబ్ద చిత్రమని చెప్పవచ్చు. యుద్ధ వర్ణనలో మన కళ్ళను యుద్ధ భూమి మధ్యలో నిల్పుతాడు.

5) బుద్ధి గమ్యము: తిక్కన భావావేశము గల ఘట్టము లందు బుద్ధి గుణాలకి ఎక్కువ అధికారమిచ్చును గాని ఆ ఆవేశ ప్రవాహమున బడి కొట్టుకొనిపోడు. శబ్దము నే భావమునకు లోనుగావించి భావానుగుణముగ దానిని త్రిప్పి నడిపించు మహావాక్కు తిక్కన.

6) అమలోదాత్త మనీష: తిక్కన తర్కము నకు లొంగ జాలని యే సిద్ధాంతము ను చేయడు. ఉదాహరణకు

"వలనధికంబుగా గలుగు వైద్యులు శాస్త్రము ---" పద్యంలో నరుడు లేచ ప్రజ్ఞ చే ప్రతికూల విధి ని అతిక్రమింపజాలడను సిద్ధాంతము చేయబడింది. దానికి "సమర్థుడైన" వైద్యుడు చికిత్స చేసినను రోగము పోకుండుట దృష్టాంతంగా చేయబడింది.

ఇదే పద్యంలో వైద్యుని సామర్థ్యము నిరూపించే విధు లక్షణాలలో 'వలను' అతిముఖ్యం గాన అదే మొదట చెప్పాడు. ఇది బుద్ధి గమ్యానికి తార్కాణము.

7) రాజనీతిజ్ఞత: మనుమసిద్ధి మంత్రిగా యుద్ధతంత్రాలు

రాయబార నీతులు, రాజనీతి, స్వయంగా తెల్పిన తిక్కన ప్రతిభ సంజయ, శ్రీకృష్ణ రాయబారాల్లో, యుద్ధ వర్ణనలో, వెల్లడౌతుంది. ఆ యుద్ధ వ్యూహాలను వివరించేటప్పుడు

8) వ్యంగ్య వైభవం: తిక్కన కవితకు గౌరవం తెచ్చిన గుణాల్లో వ్యంగ్యం ప్రధానమైనది. సంజయుడు 'క్షేమమేనా' అని అడిగినప్పుడు ధర్మరాజు సమాధానంగా చెప్పిన

" ఆ రాజును మా దేశంగల ! ---- " పద్యం పైకి అమాయకంగా కన్పించినా లోపల తీవ్రమైన గండ్లను దాచుకున్నది సి.నారాయణ రెడ్డి వ్యాఖ్యానించారు.

రాయబారానికి వెళ్తున్న కృష్ణుడికి ద్రౌపది చెప్పిన మాటల్లో ఉత్తరోత్తరం వ్యంగ్యం తాండవిస్తుంది.

9) పద సౌందర్యము: తెలుగు భాషా దృష్టి: పదముల ను ఎన్నుకొనునట్లుగ, అర్థము విశేషములతో అమర్చునట్లుగ ఉపయోగించుట అల్పాక్షరాలలో అనల్పార్థ రచన గావించుట తిక్కన కవితా విభాగాలల్లో ఒకటి. తెలుగు భాష కు గల బలము ను నిరూపించినాడు తిక్కన. మచ్చుకు

" నడవడి యనుమాన్యతుం ---- "

" తనియ బండ కుండ మునుగసిరాన జివి చేయగాదు విత్తుచేటు గలుగు ---- " వంటి వందల కొలది

పద్యాలలో తెలుగు పదాల పొందిక, భావగాంభీర్యములు తిక్కన తెలుగు భాష కు జీవము పోసినటుకు నిదర్శనలు.

10) భాషా సృష్టి: అచ్చు తెలుగు భాషకు కావ్య రచనా గౌరవమును తెచ్చిన వాడు తిక్కన. సూక్ష్మాతి సూక్ష్మ మనోభావముల నుండి శాస్త్ర పరమార్థముల వరకూ అచ్చు తెలుగు భాష వివరించగలదని చూపినాడు. అట్టి భాష అంతయూ తిక్కన సృష్టించుకొన్నదే. వ్యావహారిక భాషా పదాలకే ముద్ర రూపమును, కొత్త ప్రాణము ను ఇచ్చి ఆయన భారతము ను 'విరచించెను'. ప్రాణ వర్ణములు గల పౌరవ మహారాజు చరిత్ర కథనములో ఒక్కొక్క మహారాజు గురించి "లోకాంతర గతుడయ్యెను" అను వాక్యార్థమును భంగ్యంతరము న పదియారు విధములుగ చెప్పి తన భాషా సృష్టి వైభవమును చాటెను.

11) తెలుగు దనము: తిక్కన తెలుగుదనం గాఢంగా పాత్రుకొనేలా తెలుగు నుడికారాలు, జాతీయాలు, సామెతలు ప్రయోగిస్తాడు. తెలుగు భాషలోని కాకువు (ఊనిక, స్వరం) ప్రయోగించడం, నెల్లూరు మాండలికాల్ని ప్రత్యేకం విరివిగా వాడటం కన్పిస్తుంది.

'పగయాగాలికైనని పాముతో యింటిలో నున్నయట్లుండు',
'నూతి కప్ప విధమున'
'ఏనుగునకు సిబ్బ చూపినట్లు'
'పాలలో బడిన బల్లి విధంబున' మొదలైన సామెతలు జాతీయాలు

ప్రయోగిస్తాడు. అట్లే
'పెట్టని కోట నీకు హరి'
'అడుగు మాలి పోవు' మొ॥ నుడికారాలు కన్పిస్తాయి.

సంస్కృతాంధ్ర + కావ్య, శాస్త్ర

12) ఉభయ కవి మిత్రుడు: అవసరమైతే తప్ప తిక్కన సంస్కృతం జోలికి పోడు. "జాత్యములు గాని [illegible] నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప" నని చెప్పుకున్నాడు. అందుకే

"దుర్వారోద్దామ బాహు విక్రమ ----" అని అవసరమైనచోట్ల తాను చేసిన సంస్కృత పద ప్రయోగం అతని ఉభయ భాషా ప్రావీణ్యం చాటుతుంది.

13) ఔచిత్య పోషణము: తిక్కన ఔచిత్య పోషణకు తన కవిత లో మిక్కిలి శ్రద్ధ వహించెను. బృహన్నల ను నర్తకిగా నియమించే ముందు అతను నపుంసకత్వాన్ని పరీక్షించినట్లు మూలంలో ఉండగా తిక్కన దానిలోని ఔచిత్యాన్ని గుర్తించి "నైపుణ్యంబు నను చింతించి బుద్ధి నరసి పాల్పడుట లేమి" అని ఔచిత్యంతో ఆ భావం చెప్పటం విశేషము / ఇందుకు సాక్ష్యము.

14) వివిధ శాస్త్ర పాండిత్యము: తిక్కన భారత రచనలోన పలు పద్యాలలో అతని బహుశాస్త్ర పాండిత్యము ప్రకటితమవుతుంది.

" వలనఁ ధీరంబుగా గలుగు వైద్యులు ---" పద్యంలో అతని వైద్యశాస్త్ర ప్రవేశం

" పంచాంగ కాల్వ రేఖా
పరిశీలి తన మేన ---" పద్యంలో

అతని యోగశాస్త్ర ప్రావీణ్యం ఇందుకు ప్రబలోదాహరణలు.

నిజమే - తిక్కన గూర్చి ఎర్రన గారన్నది నిజమే, " తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదు ".

Extra

యుద్ధ పర్వములన వర్ణనీయ విషయమంతయు సమిత వేగంతో సాగిపోయెడి దృశ్య పరంపరలగుచు. అయిన దానిని నిర్వహించిన విధము అద్వితీయము. యుద్ధ రంగమున ఆయా వీరుల/అసాధారణమైన స్వభావములు ఔచిత్యములైన ఆలాపములు, పరస్పర సంభాషణలు మొ|| వర్ణనా పాటవముతో గాక రౌద్ర రసానుగుణమైన వారి శస్త్రన్యాస, ధనుర్న్యాస, శీఘ్ర చాలన ప్రహరణాదులను కూడా సూక్ష్మాతి సూక్ష్మ వివరణములతో వర్ణించి మన తలపులను యుద్ధభూమిలో సంచరింపజేయును.

సాహిత్య పరంగా శైలిని రెండు విధములుగ విభజింపవచ్చు.

శాస్త్ర సాంప్రదాయిక సరణి: ఇందు గల ఆక్షేప, నాటకీయ, వర్ణనాత్మకములు అను భేదములతో తిక్కన శైలి నడచినది.

పద గుంభన సరళి: ఇందులో ఉన్న బుద్ధిగమ్య, భావస్ఫోరక,

# ఎఱ్ఱన కవితా రీతులు

ఆంధ్ర సాహిత్య చరిత్రలో క్రీ.శ. 1320 నుండి 1380 మధ్య కాలాన్ని ఎఱ్ఱన యుగము అంటారు. ఎఱ్ఱన అద్దంకి ప్రభువు ప్రోలయ వేమారెడ్డి ఆస్థానకవి. ఇతడు రామాయణము[3], హరివంశము[4], ఆరణ్యపర్వ శేషము[1], నృసింహ పురాణము[2]లను రచించెను. ఇతనికి శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు అను బిరుదములు గలవు.

ఎఱ్ఱన కవితా రీతులను క్రింది విధంగా వివరించవచ్చు

1) ప్రబంధ పరమేశ్వరత్వము / ప్రబంధ పరమేశ్వరత్వాలు :

కావ్య రచనా కుశలుడగుటచే ఎఱ్ఱన ప్రబంధ పరమేశ్వరుడని దివాకర్ల వేంకటావధాని గారన్నారు.

ఇతివృత్తము ను వర్ణనల చే అలంకరించెడి సూత్రపద్ధతికి సూత్రధారుడు అగుటచేతనే ఎఱ్ఱన ప్రబంధపరమేశ్వరుడని పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పారు.

ప్రక్రియకు అనువైన రచనా బంధం ప్రసిద్ధం గా రాణించేటట్లు ప్రపంచించటం ప్రబంధపరమేశ్వరత్వం. హరివంశాన్ని పురాణశైలి లో ఆరణ్యపర్వశేషాన్ని కావ్యకవితా శైలి లో నృసింహపురాణాన్ని ప్రబంధకవితా శైలి లో ఇలా ఇచ్చవచ్చినట్లు సంచరించే సృజనాత్మక శక్తి గలవాడు. విశ్వనాథ సత్యనారాయణ గారందుకే ఎఱ్ఱన ను 'సర్వామోఘేచ్ఛా విధాతృండు' గా కొనియాడారు. ఇది ప్రబంధ పరమేశ్వరత్వానికి పరోక్ష వ్యాఖ్య.

జక్కన విక్రమార్క చరిత్రలో ఎఱ్ఱన ను

'చిత్రకవిత్వ వాగ్విభవజృంభితు' అని పేర్కొన్నాడు. ప్రక్రియకు అనుగుణమైన వర్ణనాత్మకతని, సూక్తిశక్తిని, వాగ్విభవాన్ని వెలార్చు గల వాగ్వైదగ్ధ్యం ఎర్రనకు ఉన్నాయని జక్కన అభిమతం. ఇది కూడా ప్రబంధ పరమేశ్వరత్వాన్ని చాటేదే.

ప్రక్రియల యొక్క లక్షణాలను, గుణాలను, స్వభావాలను ఏర్పడే గాఢమైన అనుబంధం, అంటుకట్టు, దానికి అనగునట్లు రచనలో సాగించే శబ్దార్థ రూపమైన శైలి కూడా ప్రబంధమే. అంటే - ప్రక్రియోచితమైన శైలిని ప్రదర్శించగల ఉక్తి వైచిత్రి ప్రబంధపరమేశ్వరత్వం.

హరివంశం: పురాణకవితాశైలి + ఇతిహాస వస్తువు + కథాకథన పద్ధతి

అరణ్యపర్వశేషం: కావ్యకవితాశైలి + ఇతిహాస వస్తువు + ఉభయ (కథన + వర్ణన) పద్ధతి

నృసింహపురాణం: ప్రబంధశైలి + పురాణకథ + క్షేత్రమాహాత్మ్యాలు + కావ్యవర్ణనలు

2) తద్రచనయకా:

"---ఆత్మకవితా రీతియు గొంత దోప తద్రచనయకా నారణ్య పర్వశేషము పూరించె..." అని అరణ్యపర్వశేషంలోని పద్యంలో ఎర్రన తాను నన్నయలాగా రచిస్తానని చెప్పాడు. ఈ విధంగా నన్నయ మిగిల్చిన కావ్యభాగాన్ని నన్నయ పేరుమీదే గాక ఆతని శైలిలోనే వ్రాయడం ఎర్రన గొప్పతనం.

భారతం లో నన్నయ మధ్యాక్కరలు అధికంగా వాడాడు. తన ఇతర రచనల్లో మరెక్కడా మధ్యాక్కరలు వాడని ఎర్రన అరణ్యపర్వశేషం లో వాడటం ఈ తద్రచనయా-- పొడగట్టుదానికే. అయితే నన్నయ మధ్యాక్కర లో యతి అయిదవ గణం మొదటి అక్షరం మీద ఉంటే ఎర్రన మధ్యాక్కర లో యతి నాలుగవ గణం మొదటి అక్షరం మీద ఉంది. తత్కాలీన శైలియను గౌరవదోష -- ఎర్రన ఈ మార్పు చేసి ఉంటాడు.

సీసపద్య రచన లో నన్నయ కేవలయతి సీసాలు, కేవల ప్రాస సీసాలు, పూర్వార్ధములో యతి, ఉత్తరార్ధములో ప్రాస, ఉత్తరార్ధములో యతి, పూర్వార్ధములో ప్రాస - అను నియమములనేర్పరచుకొని వాటిని యథావిధి పాటించాడు. ఎర్రన వీటిని కొన్ని చోట్ల పాటించకున్నా మొత్తం మీద అట్టి నియమాలు ఎర్రన అరణ్యపర్వ రచన యందుండుట తద్రచనయా ప్రాయపూనడమే.

నన్నయలాగా ఎర్రన అర్థగుణాల కంటే శబ్దగుణాలకే మొగ్గ చూపి ఆయన లాగే ప్రసాదమాధుర్యాలకు పెద్దపీట వేశాడు. "శ్రీ స్తన కుంకుమద్రవ నిషిక్త ---" అనే నృసింహపురాణ పద్యంలో మూడు చరణాలలో ఒకే సమాసాలను నడిపినాడు. ఇట్టి గడుసుదనము ఎర్రన ప్రవృత్తి & భిన్నము. ఈ పద్యము, సంస్కృతపద గుంఫనము-తో అక్షర రమ్యత లో నొప్పి అన్వయక్లేశ రహితమై ధారా గమన శోభితమై నన్నయ పద్యాన్ని తలపిస్తూ ఎర్రన తద్రచనయా... ఇతర గ్రంథాల పై కూడా ప్రభావము చూపెనని తెలుపును.

వేదాల తిరుమలవేంకటాచార్యులు(గారు) " నన్నయ ఎత్తిన కవితను కలసి మెలసి నన్నయ రచనయే యనునంతటి

యోను భూషణుడు నందినవి".

3) సూక్తి వైచిత్రి :- ప్రబంధ పరమేశ్వరుడు అను కూడా కొనియాడగ పేర్కొన్న "చతురోక్తి పదంబు"లని శ్రీనాథుడు "సూక్తి వైచిత్రి" గాను జక్కన "శబ్ద వైచిత్రి" గాను చింతలపూడి ఎల్లనార్యుడు "నానావిధ పటునవ దేశన కవితరసస్ఫుర భంగ సలిలోర్మి ఘూర్ణమాన ధ్వని మృదు మధుర వాచస్ఫురద" గాను భావించి ఎర్రనపై భక్తి కురిపించారు.

సూక్తి అనగా మనోజ్ఞముగా చెప్పబడిన మాట. రుచిరమై చమత్కార యుక్తమైన కూర్పు కూడా సూక్తియగును. 'సూక్తి వైచిత్రి' అనగా భావనా శక్తి చే మనస్సు నాకట్టుకొని మధుర చాతుర్యోక్తులచే లోకోత్తర చమత్కారము నిర్వహించి హృదయ వికాసమును కల్గించునదే - అని జి. నాగయ్య గారి వివరణ. సులభమైన జాతీయ పదములతో నుడికారములతో కూడి మనోజ్ఞమైన తెలుగు వారి సంభాషణా ధోరణి ని స్ఫురింపచేయు రచననే ఎర్రన "చతురోక్తి పదంబు" లని వ్యవహరించి యుండవచ్చు నని నాగయ్య గారి అభిప్రాయపడ్డారు.

ఎర్రన హరివంశంలో హృద్యోక్తులు, అరణ్యపర్వశేషంలో చతురోక్తులు, నృసింహ పురాణంలో మధురోక్తులు పండించాడు.

సావిత్ర్యుపాఖ్యానం లోని

"కన్నులు వచ్చి యెల్లెడలు గన్గొని వృద్ధ నరేంద్రుఁ డాత్మకుం
గన్నులు చాలెనైన ----" పద్యం చతురోక్తి కి

చక్కని ఉదాహరణం.

ఇటువంటి సారి ఎఱ్ఱన కవితలో పేర్కొన్న "మధురోక్తి గుంభన" కు నృసింహపురాణములో హిరణ్యకశిపుని తపము చెఱుపు తలచి దేవేంద్రుడు అప్సరసలను పంపు సందర్భములోని

"వలతలు గ్రొచ్చి తెలగుల వచ్చి జపంబుల గ్రాలి ---"

పద్యము చక్కని తార్కాణము.

అరణ్య పర్వశేషములో అత్రి గౌతమ సంవాద సందర్భములోని

"కలయు నరలు వచ్చి తల తెల్లనైనంతనే. చేసి నీకు నెట్లు చేయునెటుక
జ్ఞానవృద్ధుండైన వాని మాటలు గదా సభలందెల్ల నార్యజనుల కెక్కు"

చక్కని సూక్తి.

'కుంపటి లో తామర మొలచిన క్రియ'

'నిప్పున చెదలంటునే'

'పాంసు నీయయు వాడు వెడిక్కగలుగున' వంటి లోకోక్తులు ఎఱ్ఱన సూక్తి వైచిత్రి ఫలమే.

4) వర్ణనలు: నన్నయది కథాకథనాత్మక శైలి, తిక్కనది నాటకీయశైలి ఇక ఎఱ్ఱనది వర్ణనాత్మక శైలి.

వర్ణనలలో ఎఱ్ఱన ప్రదర్శించిన భావ పటుత్వము, శాస్త్ర పాండిత్యము, లోకజ్ఞత ప్రశంసనీయములు.

భారతము న కుంతీ దేవి లోకాపవాద భీతికి పుత్ర వాత్సల్యానికి నడుమ పడిన మనోవేదన ను చక్కగా వర్ణించి భావ పటుత్వాన్ని ప్రదర్శించాడు.
చిత్రించినాడు / వర్ణించాడు.

హరివంశము లో గోపకులు బృందావనానికి వలస పోవటం, వాన లో గోగణము, గోపాలురు పడిన పాట్లు ఇత్యాదిగా వర్ణించిన గోప జీవిత ఘట్టాలు ప్రత్యేకంగా ఒక Pastoral Poem గా చదివి ఆనందింపవచ్చు. కృష్ణుని బాల క్రీడలను

" పాలుపారగా బోరగిలి పాకు నాల్గువయూలలకును --- "

అనే పద్యం లో అద్భుతంగా వర్ణించాడు. లోకజ్ఞత

నృసింహ పురాణం లోని క్షీరాబ్ధి, శ్వేతద్వీప, వైకుంఠ పురాల వర్ణనలు ప్రబంధ కవులకు మార్గదర్శమయ్యాయి. శ్రీమన్నారాయణుని రూప ప్రవృత్తులకును, నరలోకల ప్రవృత్తి ప్రవృత్తులకును ఉపమానోపమేయ భావము సంఘటిల్లి వర్ణనకు సార్థకత సిద్ధించుచున్నది. ద్వితీయాశ్వాసమందలి శ్రీహరి ప్రత్యంగ వర్ణనము కృష్ణ సాక్షాత్కారము ను చేయుచున్నది. నరసింహ రూప ఆవిర్భావం చూపుడు కూర్చిన. స్తంభోద్భవ వచనము విశిష్టమైనది. ఇట్టి వర్ణనలన్నియూ అలంకారయుక్తములై అతని సాహిత్య (స్ర) విశారదత్వాము ను చాటుచుండును.

5) పాత్ర చిత్రణ: ఎర్రన పాత్ర పోషణ లో సైతం మిక్కిలి నేర్పు ప్రదర్శించాడు.

హరివంశం లో బాలకృష్ణుని పాత్రను అత్యంత మధురంగా తీర్చి దిద్దాడు. చిన్నికృష్ణుని ఆతని అల్లరి చేష్టల ద్వారా

పాత్రకి కొత్త మెరుగులు దిద్దాడు. గోపికల పాట్లు, ఫిర్యాదులు ఎంతో చక్కగా పొసగాయి. ఎర్రన యశోద తాదాత్మ్యం గలది.

మూడు నేర్పురాలు.

"నన్నయ కుంతి కంటే ఎర్రన కుంతి గడుసరి. వ్యంగ్య ప్రధానముగా మనస్సులోని భావములను వ్యక్తం చేయగల జాణ" శ్రీ జి. నాగయ్య వ్యాఖ్యానించినది సబబే. అందుకు కుంతి పలికిన ఈ పద్యం

"జగములయందు ధర్మజుడు ---- యావలనయ్యెడు నిందకోర్చితిన్"

పద్యం అనేకార్థకాలు.

6) ప్రబంధ పోకడలు: ఎర్రన నృసింహ పురాణము న వ్యావృత్తులు, రస [2] పోషణము, వర్ణనా [3] బాహుళ్యము అను ప్రబంధ లక్షణములు ప్రస్ఫుటముగా నున్నవి. ~~నృసింహ పురాణము చే ఎర్రన ప్రబంధ పరమేశ్వరుడను బిరుదు సార్థకమగుచున్నది.~~

వేటూరి శివరామ శాస్త్రి అన్నట్లు

"ఎర్రయ జన్మతః కవి. భావుకత అతనికి పరివేషము. అతని కవితాశయ్య పుష్ప గుంఫితము. హృదయము రసప్రస్రవణము".

భావ పటుత్వము → కుంతీ మనోవ్యథ

శాస్త్ర పాండిత్యము → దాముగాల్పు మున్నగు వ్యాధులు + అలంకారాలు

లోకజ్ఞత → జానపద జీవిత చిత్రణ.

స్వభావము చేత ఎట్టినది వర్ణనాత్మకమైన

కవిత్వములయు, వర్ణనలనగా ప్రత్యేక వర్ణనలెగాక రూప వర్ణనలును తెలియును. భావ వర్ణనలను వర్ణనా శైలికి చెందినవేయులయు ~~[illegible]~~ వర్ణనాత్మకమైన ఎట్టిన రచనలలో చిన్న కథాత్మకమైనను పాత్రల వివిధ భావ జాలన వ్యక్తీకరణము వలన విఫలమగును. ఆ భావ వ్యక్తీకరణము పాత్ర చిత్రణములనగను, రస పరిపాలనములకు హేతువగును. ఎట్టిన ఆంధ్రదర్శనము లో వ్రాసిన కర్త లనన వృత్తాంతము ఈ సిద్ధాంతములకు ఒక నిదర్శనము. అప్పుడు కులాలకున్న లోకాపవాద, శత్రు వాళ్ళల్ల సంఘర్షణ వలన అనుభవానిక మనోవ్యధ హృదయ విదారకంగా వర్ణింపబడినది. ఈ వృత్తాంతమునే ఆవిష్కారమునే నవలా సేనాని రచించెను. కానీ ఎట్టిన వర్ణనల వలన ఆంధ్రదర్శనమునకు కథ పొందిన విస్తృతి పరిగణింపదగినది.

# ఎఱ్ఱన కృతులు - సమీక్ష

ఆంధ్ర సాహిత్య చరిత్ర లో క్రీ.శ. 1320 నుండి 1380 మధ్య కాలాన్ని ఎఱ్ఱన యుగమంటారు. ఎఱ్ఱన అద్దంకి ప్రభువు ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవి. ఇతడు ప్రబంధ పరమేశ్వరుడు, శంభు దాసుడు. ఇతని కృతులలో హరివంశము, ఆరణ్య పర్వ శేషము, నృసింహ పురాణములు లభ్యములు కాగా రామాయణము అలభ్యము. ఇతడు 'కవిసర్పగారుడమను' ఛందో గ్రంథమును కూడ రచించినట్లు కస్తూరి రంగకవి ఆనందరంగరాట్ఛందమున ఉదాహరించినను అది అలభ్యము.

హరివంశావతారిక యందు రామాయణ రచనా ప్రసంగమున్నది. నృసింహ పురాణావతారిక యందు భారతారణ్య పర్వశేష రచనా ప్రసంగమున్నది. అయితే ఈ రెండు కంటెను ఏది ముందో రూఢి గా చెప్పలేము. హరి వంశపు శైలి కంటె భారత శైలియు, దాని కంటె నృసింహ పురాణ శైలియు మేల్తరముగా నుండును. కావున రామాయణ హరివంశములను రచించిన పిమ్మటనే ఎఱ్ఱన భారతారణ్యపర్వశేష నృసింహపురాణాలను రచించినాడని తలంప వచ్చును. మొదటి రెండు నరాంకితములు కాగా అరణ్యపర్వశేషము ప్రేక్ష నిరపేక్షమైన సాహిత్యకర్మ, నృసింహపురాణము పారమార్థిక చింత తో చేసిన ఈశ్వరార్పణము (అహోబలస్వామికి అంకితము) కావున ఈ వరుసయే ఉచితమని మానవ సహజ

స్వభావము ను బట్టి ఆలోచించి పింగళి లక్ష్మీకాంతం గారు సైతం చెప్పియున్నారు.

## రామాయణము:

ప్రోలయ వేమారెడ్డి "... మొదల మెల్పు రామ కథయును జెప్పించి యత్యుత్తమ ఖ్యాతి బొందితి..." నని చెప్పినట్లు హరివంశము న గలదు. కనుక నిది రాజాజ్ఞ మేరకు వ్రాయబడి అతనికే అంకితమై యుండును. దీనిని "వల్మీకభవు చే వైఖరి రామాయణంబు నాంధ్ర* ప్రబంధము చేసెనని" మల్లయ కవి మాటల వలన తెలియుచున్నది.
(చదలవాడ మల్లన తన విప్రనారాయణ చరిత్ర పీఠిక.లో)

ఈ గ్రంథమిపుడు అలభ్యము. గణపవరపు వేంకటకవి తన ప్రయోగ రత్నాకరము లో 'ఎఱ్ఱాప్రెగడ సంక్షేప రామాయణము నుండి' అని ఒక పద్యము చెప్పాడు. అయితే మల్లయ మాటల వలన ఎఱ్ఱన వాల్మీకి ననుసరించి సంపూర్ణ రామాయణమునే రచించినాడని చెప్పవచ్చు.

కూచిమంచి తిమ్మకవి 'సర్వ లక్షణ సార సంగ్రహము' లో ఎఱ్ఱన రామాయణము లోనివని 9 పద్యములనుదాహరించాడు. వేటూరి ప్రభాకర శాస్త్రి గారు ఎఱ్ఱన రామాయణములోనివి కాదగు 46 పద్యములను ప్రకటించారు.

వీని బట్టి పరిశీలించగా ఎఱ్ఱన బాలకాండము మొదలు యుద్ధకాండాంతము వరకు గల పూర్వ రామాయణమంతయు రచించియే యుండునని తెలియును.

ఈ పద్యములను బట్టి చూచినచో భాస్కర రామాయణము కంటె మిన్నయైన రచన యని చెప్పవచ్చును. అయితే మూలానుసరణము సరసుల నాకర్షించియున్నను సామాన్యులను మెప్పించెడి అవాల్మీకాంశములు లేక పోవుటను బట్టి భాస్కర రామాయణము వలె ఎఱ్ఱన రామాయణము లోకమున ఖ్యాతి చెందియుండదు.

హరి వంశము :

ప్రోలయ వేమారెడ్డి ఎఱ్ఱన ను

" భారత పరాంశమని యం
బారగ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారస్య కథ దెనుంగున
ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్ "

అని అర్థించగా ఎఱ్ఱన 'నన్నయ భట్టు తిక్క కవినాథులు చూపిన త్రోవ పావనం' అని ఆ మార్గమున హరి వంశము రచించి ఆ రాజుకి అంకితమిచ్చినాడు. అయితే నన్నయతిక్కనాదుల అనువాదం కంటె ఎఱ్ఱన అనువాదమందొక విశిష్టత యున్నది. అతని హరివంశమున మూలాతిరిక్తములై, సర్వత్రా స్వతంత్రములై కన్పట్టు విశేషములెన్నియో కథా సంవిధానముకై అతడు స్వీయముగా చేసిన మార్పులు కావు. ఆ కథా సంబంధియైన గ్రంథముల నుండి ఏర్చి కూర్చిన చేర్పులని చెప్పవచ్చు.

మూలమున హరివంశమున హరివంశ పర్వము, విష్ణు పర్వము, భవిష్య పర్వమని మూడు భాగములున్నవి. ఎఱ్ఱన ఈ విభాగములను గ్రహింపక తన గ్రంథమును పూర్వోత్తర భాగములుగ విభజించెను. అందు పూర్వభాగమున ఎనిమిది, ~~ఉత్తర~~ భాగమున పది యాశ్వాసాలున్నవి. మూలమునందలి షట్పుర వధ, భానుమతీ హరణము, ప్రభావతీ ప్రద్యుమ్నుల దుష్యంతుని కథ, మొ॥ అనువదింపబడలేదు. మరికొన్ని ఘట్టములు సంక్షేపింపబడినవి. కొన్నిటిని పెంచి వ్రాసెను. నీలాసుందరి పరిణయము వంటివి అమూలకముగ కల్పింపబడ్డవి.

కృష్ణుని బాలక్రీడలను ఎఱ్ఱన సహజముగ వర్ణించిన తీరు " పొలుపారంగా బొరగిలి పాన్పు నాల్గు మూలలకును ---" రమణీయమైనది.

గోపులు సకుటుంబసమేతంగా వ్రేపల్లె వీడి బృందావనం వలస పోవుట, బృందావనమున మందలకు దావాగ్నుల ముప్పుగ వ్యాధులు వచ్చుట ముఖ్యమైనవి ఎఱ్ఱన జానపద జీవిత పరిజ్ఞానానికి తార్కాణం. వానిలో గోగానాలు, గోపాలురు పాడిన పాటలు, శ్రీకృష్ణుడు గోపాలురతో యమునానది యందు ఆడిన జలక్రీడలు ముచ్చటగా వర్ణించాడు. శ్రీకృష్ణుని బాల్య విహారములకు రంగస్థలమైన గోకులమును, గోప జీవితమును వర్ణించిన ఘట్టములు ఎఱ్ఱన హరివంశములో ఒక ప్రత్యేక Pastoral Poem గా

చదివి ఆనందింపదగియుండును. గోకుల వర్ణన యిచ్చట
ఎఱ్ఱన వాల్మీకమును చిత్రించిన నిరాడంబర దాంపత్య చిత్రములు
పోతన భాగవతమందునను గానరాదు. గోపికా యశోదల సంవాదాలు,
యశోద ధూర్త గోపాలుని మందలించుట ఇత్యాది సాంసారిక
సన్నివేశములలో ఎఱ్ఱన హరివంశము పోతన భాగవతము
కంటె గుణోత్తరమని చెప్పదగి యున్నది.

ఎఱ్ఱన హరివంశమును 'సుశ్లేషమగు
వాగ్విశ్రమంబు' లో 'సంక్షిప్త విస్పష్టములగు వాక్యంబులన్'
'సముచిత ప్రాఖ్యాన విఖ్యాతంబుగ' 'సమధిక రస భరితముగ'
రచియించెను. హరివంశ రచనలో నాద సౌందర్యము, అర్థపుష్టి
నెలకొనినవి. పాండిత్య ప్రకర్ష అధికముగనున్న దినములలో
ఎఱ్ఱన సంయుతంగా పాటించి నన్నయతిక్కనల మార్గంలో
లౌకిక రస పరిపాకము లో రచించెను.

## అరణ్య పర్వ శేషము :

'ఎక్కడ నుండి ఎఱ్ఱాప్రెగడ కవిత్వము' అను
శీర్షిక గాని పర్వాంత పద్యములు గాని ఉన్న ప్రతులలో కానరావు గాన
ఇది ఎఱ్ఱన కృతి గాదందురు. అయితే అవి కథా భాగములను
చెందినవి కావున గాన ప్రాయముగా వదలి వేసి యుండవచ్చు.
" ప్రబంధ పరమేశ్వరుడనగ నరణ్య పర్వశేషమ్యులు మహాభాష

సుజనోత్సవ మొప్పగ నిర్వహించి" అని ఎర్రనే చెప్పుకొనుట చే ఇది తెల్పవలసినది. అది (ఉపాఖ్యానాలుగా ఉద్ధరణాలు, పురాణాలు లేదా ఇతిహాసాలు) ఎర్రన చేసిన కృతుల పురాణమా? స్వతంత్ర రచనమా? అని.

తిక్కన, మార్గన లు నన్నయ మూడు పర్వాలు రచించెనని చెప్పిరి. ఇది స్థూల దృష్టితో చెప్పినది. నన్నయ అరణ్యపర్వమందు కూడా కొంత రచించియుండుట చే, ఎర్రన వారి తర్వాత కాలంలో భారతాన్ని పూరించుటచే ఇది సమస్యగా తోచదు.

శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో నన్నయ, తిక్కనలనే స్తుతించి ఎర్రన ను వదిలి వేసినను శృంగార నైషధం, కాశీఖండములలో ముగ్గురినీ కలిపి 'కవిత్రయము' అను అర్థము స్ఫురించునట్లు ప్రస్తావించుట గమనించదగినది. ఇతని సమకాలికుడు జక్కన విక్రమార్క చరిత్రలో "ప్రబంధ పరమేశ్వరుడై విరచించె శబ్దవైచిత్రి నరణ్యపర్వశేషము" అని స్పష్టంగా చెప్పాడు.

నన్నయ భాగంలో మాత్రమే భారతంలో మధ్యాక్కర లుండటంచేతనూ ఎర్రన ఇతర గ్రంథాలలో మధ్యాక్కరలు లేకుండుటచే ఇది నన్నయ పులమేయని కొందరందురు. అయితే సూక్ష్మంగా చూస్తే నన్నయ మధ్యాక్కరలో ఆరవగణం మొదటి అక్షరానికే యతిస్థానం ఉండగా ఎర్రన పద్యాలలో నాలుగవ గణం మొదటి అక్షరానికి యతి పాటించబడింది. ఎర్రన తద్రచనయగా... మధ్యాక్కర భారతం లో ప్రయోగించి ఉండొచ్చు. పాదగట్టుటకే

తత్వవిచారాలేవియు కొంతవరకు ఈ ఛందో భేదాన్ని కల్పించియుండవచ్చు. ఇది ఎర్రన అరణ్యపర్వశేష కర్తయనుటకు ప్రబల కారణము. సీస పద్యములను నన్నయ కొన్ని నియమములను ఏర్పరచుకొని వానికి లోబడి రచన చేసాడు. ఎర్రన సీసములలో ఈ నియమములు అంత ఖచ్చితముగా పాటించబడుట కానరాదు.

ఆది పర్వములో కర్ణుడు సద్యోగర్భమున జనించెనని యుండగా ఎర్రన కుంతి పది మాసములు మోసి ప్రసవించినది తెల్పెను. ఒకే కవి ఒకే కథను ఇలా విరుద్ధంగా వ్రాయలేడు గదా! అదిగాక అరణ్యపర్వంలో లోకాపవాదు - పుత్రవాత్సల్యం నడుమ కుంతి పడ్డ మనోవేదన హృదయవిదారకంగా వర్ణించబడ్డ తీరును నన్నయ కథతో పోలిస్తే ఎర్రనది వర్ణనాత్మక శైలియని అది నన్నయకృతం కాదని విశదమౌతుంది.

నన్నయ కాలము నాటి కొన్ని విశేష్యములు, విశేషణములు, క్రియలు మొదలగు శబ్దములు ఎఱ్ఱన కాలము నాటికి మార్పు చెందిన ఆ మార్పిన రూపములో అరణ్యపర్వ శేషమున ప్రయుక్తములై కానబడుచుండుటచే ఆ భాగము ఎర్రన కృతమేయని నిస్సంకోచముగా చెప్పవచ్చు.

ఇందు ప్రత్యేకముగా చెప్పదగిన పెద్ద ఘట్టములు ధర్మవ్యాధ చరిత్రము, కుమారస్వామి అవతారాదులు, సైంధవ

పరాభవము, రామకథ, సావిత్ర్యుపాఖ్యానము .

ఎఱ్ఱనకు 'ప్రబంధ పరమేశ్వరుడ'ను బిరుదమునూ కవిత్రయములో నొకడిగా గౌరవ స్థానమునూ ఈ రెంటి పద్య రచన వలననే గలిగినవి .

## నృసింహ పురాణము :

ఎఱ్ఱన, తాత ఎఱపోతసూరి ఆదేశము మేరకు బ్రహ్మాండాది పురాణోక్తమయిన శ్రీ నరసింహావతారమును పురాణముగా తెనిగించినాడు. ఈ అహోబల నరసింహునికి తన కావ్యమంకితమిచ్చి ధన్యుడైనాడు.

ఈ గ్రంథము పలు చోట్ల గల ప్రయోగములను బట్టి ఎఱ్ఱన దీనికి "లక్ష్మీ నరసింహావతారము" అని పేరు పెట్టినట్లు తెలియును. కాని లోకవ్యవహారమున 'నృసింహ పురాణమని'యే ఇది వ్యవహరింపబడినది.

ఇందు అహోబల క్షేత్ర మాహాత్మ్యము ఐదు ఆశ్వాసములలో వర్ణించబడింది. ఎఱ్ఱన ఇందులో ప్రబంధ శైలి ప్రదర్శించినాడు. కథాగమనములో కంటే వర్ణనలలోనూ, పద్యముల జిలుగులలోనూ శబ్ద మాధుర్యములోను ఇందులో నేర్పు ఎక్కువగా కన్పట్టును. దీని మనసునందుంచుకొనియే పోతన భాగవతం వ్రాసినట్లుగా స్ఫురించును.

అయితే ఈ గ్రంథము పాండురంగ మాహాత్మ్యాదుల వలె కేవల క్షేత్ర మాహాత్మ్య గ్రంథం కాదు. ఇందు క్షేత్ర మహిమ

నిరూపకములైన ఉపాఖ్యానములు గాని క్షేత్ర సంసేవనము వలన తరించిన భక్తుల కథలు గాని లేవు గాన ఇది స్థల పురాణముగా కాదు. ప్రహ్లాద రక్షణా రూపమైన నృసింహావతారమే ఇందు ప్రధాన ఇతివృత్తము.

ప్రధాన కథకు భంగకరమగు ఉపాఖ్యానములు లేక ప్రహ్లాద, హిరణ్యకశిపుల వృత్తాంతమే మొదలు నుండి తుది వరకూ వర్ణింపబడుటచే వస్త్వైక్యము సాధింపబడినది. దీనికి తోడు కావ్యకారణ నిబద్ధతయూ సాధించాడు ఎఱ్ఱన. పైగా ప్రబంధోచితములైన అష్టాదశ వర్ణనలలో పెక్కు సముద్ర, శైల, పుర, హార, నాయక, ఋతు, ఉద్యానవనాది వర్ణనలు చేరియున్నవి. ఇవన్నియు యథాభావరసావస్థముగా కావ్యమూర్తికి సుందర అవయవములుగా తీర్చబడ్డవేగాని బలాత్కారముగా కథలో చొప్పించ బడినవి కావు. ఇందు వస్త్వైక్యము, వర్ణనా బాహుళ్యము, రసపోషణము అను ప్రబంధ లక్షణాలు ప్రస్ఫుటముగ నున్నవి. అయితే ఇది మానవ నాయకుడు, సాంసారిక కథ కలిగినది గాదు. ఇందు సాక్షాత్ శ్రీమహావిష్ణువే నాయకుడు గాన ఇది మనుచరిత్రాది ప్రబంధములతో విభేదించును. ఇది ఒక పురాణ ప్రబంధము.

నృసింహపురాణమున ఎఱ్ఱన వచన రచన ప్రౌఢ పరిణతి నందినది. స్తంభోద్భవ వచనము దిఙ్ముఖాభీలము, ఉత్కలికా ప్రాయములగు రచనయై విస్మయమును, ఉగ్రమును అయిన నరసింహావిర్భావమును శబ్దానుకరణముగా ప్రత్యక్షము చేయుచున్నది.

పోతన నృసింహుడు హిరణ్యకశిపుని

వధించిన తర్వాత కూడా భయంకరముగనున్నాడు. లక్ష్మీదేవియే ఆతనిని సమీపింప జంకినది. కాని ఎఱ్ఱన నృసింహుని రూపము

" దారుణా ఖేలనము - లీల - వీర - రౌద్ర - భయానక విస్మయాత్మక రసములలో భువనవ్యాప్తంబుగ నివ్వాళించు నిష్ఠా వక్రలాంఛనంబు". ఈ సందర్భముగ కవిత్రయ సాంప్రదాయ ధర్మము ఆత్మ సంయమనము ఎఱ్ఱన లో విస్పష్టముగుచున్నది.

నృసింహ పురాణ రచన చే ఎఱ్ఱన కు ప్రబంధ పరమేశ్వరుడను బిరుదు సార్థకమగుచున్నదని పింగళి లక్ష్మీకాంతం గారు సార్థకంగా చెప్పారు.

భక్తిం కవితా శాఖ - ఎర్రన మార్గదర్శకత్వం

add these points to Nagaraju గారి's notes

ఎర్రయ్య గారి పురాణం వల్ల పోతన గారి పోతన వల్ల నరసింహావతారం, ప్రహ్లాద కథ శాశ్వతమైనవి ఆన్ధ్రంలో ఆదరణీయాలయ్యాయి.

పోతరాజు గారి కథ " మొగ్గ మొగ్గలు విరిసి తెలుగు వాళ్ళు బాలుర కందరకు కంఠస్థం. స్త్రీలు చిన్న పిల్లలు నూనె తలంటుకొంటున్న ఈ కథ ను పాటలు కట్టి పెట్టేవారు", అని వేలూరి శివరామశాస్త్రి గారు చెప్పారు. ఎర్రన గారిని బమ్మెర పోతన ఎక్కడెక్కడ అనుసరించినది చాలా బాగా వివరించారు.

పోతన పద్యం

" కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

— — — — "

తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి."

పోతరాజు గారి ఈ పద్యం జగత్ప్రసిద్ధం. దీని ఎర్రన గారి పద్యాలు రెండు మూడు చూపెట్టారు.

" వారి భర్తల తపములు తపములు - వారి భర్తల జపులు జపులు --- "

అనే ఈ పద్య భాగం లో పాటు నృసింహ రూపం గల ఈ క్రింది పద్యం కూడా పోతన కు ఉత్తేజమిచ్చిందనవచ్చు.

"వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి తగదను తండ్రియు దండ్రి గాడు

— — — —

మాధవస్తోత్ర ఘనసుధా మధుర రుచుల - బలుకకుండెడు జెప్పయు జెప్ప గాదు"

ఎర్రన గారు విష్ణుపూజ చేయవద్దనే తండ్రి తండ్రి కాదని పద్యం వ్రాస్తున్నారు. పోతన హరిని చేరమనే తండ్రే తండ్రి అని పద్యాన్ని మలిచారు.

ప్రహ్లాదుడు ఇరవైనాలుగ్గంటలూ హరినామ స్మరణే చేస్తాడని పోతన కింది పద్యాల్లో చెప్పారు.

"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీ

— — —

— — —

— — సురారి సుతుండేతద్విశ్వమున్ భూవరా!"

దీనికి ఎర్రన గారి పద్యమే ఒరవడి,

"కుడిచినప్పుడు నిద్రగూరిన యప్పుడు మేల్కొనినయప్పుడు మెలగునప్పుడు విష్ణు
కీర్తనంబు విడువడయు గాని - పలుక డండు బుద్ధి దలపడండు"

అలాగే పోతన గారి

"ఇందుగల డందు లేడని - సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన - నందందే గలడు దానవాగ్రణి వింటే?"

ఈ పద్యాలకి, దాని ముందు ఉండే "కల డంబోధి గలండు" లాంటి పద్యాలకీ ఎర్రన గారిదే ఒజ్జబంతి.

ఎర్రన గారి ఆ పద్యం

మరొక ఎర్రన గారి కంద పద్యం ఆధారం

" హరి యను రెండక్షరములు - దారుణ దీపాంగ ఉష్ణ ఘృణి నెవ్వారిన్
హరుడొక్కడెవ్వడు భవనా - గర నిస్తరణ ప్రకార కైవల్యమునకున్! "

భక్తి ఏ దైవాన్ని ఆశ్రయించినదైనా భక్తే.
అందుకే విష్ణుభక్తి ని ప్రవచించే వాక్యాలయినా గాని ఎర్రన గారి కృతులు శ్రీనాథుణ్ణి బాగా ప్రభావితం చేసి ఆయన చేతిలో శివభక్తి రూపం లోకి మారింది. ఎర్రాప్రగడ రామాయణం లో లక్ష్మణ మూర్ఛ ఘట్టం లోని

'కందర్ప గంధ వారణ --- నీకు విషాద మేటికిన?'

అనే పద్యం శ్రీనాథుడి 'హరవిలాసం' లో

'కందర్ప గంధ వారణ --- తెలుగ మనంబున భర్తృ చిత్తరువు'

అనే పద్యం గా మారింది.

# క్షేత్రయ్య - సాహిత్య సౌందర్యం



Add this to Nag's material

→ "క్షేత్రయ్య పదాల్లోని పల్లవిలోని భావం సూచనప్రాయమైతే అనుపల్లవిలో భావం బలపడి చరణాల్లో విస్తరించి ప్రాధాన్యం వహించి, మధుర మంజులమై ఆనంద నిష్యంది అవుతుంది" (1)

— ఎస్. గంగప్ప.

→ కంచివరద, వరద కరిగిరి వరద, ఇభరాజవరద - అను ముద్రలున్న (2) 30 పదములలో క్షేత్రయ్య ఆత్మీయత గోచరిస్తుందని విస్సా అప్పారావు గారు వ్రాశారు.

→ క్షేత్రయ్య పదాలలో సాహిత్యము, సంగీతం, అభినయం మూడింటికీ ప్రాధాన్యమున్నది.

→ ఇతని పదాలు అధిక భాగం విలంబిత లయలో, త్రిపుట తాళంలో ఒదిగి ఉండడం వల్ల నర్తకీమణులకు సౌలభ్యంగా ఉంటాయి.

→ తెలుగు నుడికారానికి (3) ఉదా:

"బాగాయెనే వగలెల్ల మా బాగాయె
బాగాయె మువ్వగోపాల! నీ వగలెల్ల మా బాగాయె"

→ అచ్చ తెలుగు పదాల (4) ఉదా:

"ఎంత చక్కని వాడే
మొలక నవ్వుల వాడే - ముద్దు మాటలవాడే
తళుకారు చెక్కు - టద్దములవాడే"

→ "తన పదచిత్రాలతో ఒక నూతన అభినయ కళా సృష్టి చేసి దేవదాసీల అభినయ కళపై ఒక నూతన వెలుగును ప్రసరించిన అమరమూర్తి — అభినవ క్షేత్రయ్య"

— నటరాజ రామకృష్ణ

→ క్షేత్రయ్య 18 పుణ్యక్షేత్రాలు దర్శించి అక్కడి వేల్పులకు అంకితంగా పదాలు రచించాడు.

Read degree guide page : 171

జాను తెనుగు:

~~ఈ~~ పదాన్ని నన్నెచోడుడు కుమారసంభవ కావ్యావతారిక లో

① "సరళముగ గంగ భావములు జానుతెనుంగున నింపు పెంపుతో" అన్నాడు (ప్ర)యోగించాడు.

జాను అనేది 'చదును' శబ్దానికి రూపాంతరమని, చదును చదురు శబ్దానికి రూపాంతరమని చదురు చతుర శబ్ద భవమని <u>చిలుకూరు నారాయణరావు</u> గారు చెప్పారు. దాని వలన జాను తెనుగు అనగా చదువైన తెనుగు, చతురులైన వారిది అనే అర్థం వస్తుంది.

adminton ✗

<u>పాల్కురికి సోమనాథుడు</u> 'బసవ పురాణం' లో

② "ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను తెనుంగు / తెనుగు
చర్చింపగా సర్వ సామాన్యమగుట" అని

అనటం లో అందరికి అర్థమయ్యే అందమైన తెలుగు అని చెప్పవచ్చు. సోమనాథుడే 'వృషాధిప శతకం' లోని

✓ "బలుపొడ తోలు సీరయును ---"

అనే అచ్చ తెలుగు పద్యాన్ని జాను తెనుగు ఉదాహరణగా

(6) విన్నకోట పెద్దన ప్రకారం, దేశ్య పదాలలో 
అన్యదేశ్యాలు ఉండవచ్చు. కాని అవి స్థానికాలు
సమాజంగా మాట్లాడుతున్న అన్యదేశ్యాలు అయి
ఉండాలి. ఇదే జానుతెనుగు.

(7) డా॥ సి. నారాయణరెడ్డి ప్రకారం, క్లిష్టమైన
విషయాన్ని కూడా సామాన్య జనులకు అర్థమయ్యేలా
చెప్పేది జానుతెనుగు. దేశి శబ్దాలను, జనవ్యవహారంలో
బాగా నలిగిన, అలవాటు పడిన సంస్కృత శబ్దాలను
కలిపి చెబితే తెలుగు కు జానుతనం వస్తుంది. నిఘంటువుల్లో
మాత్రమే మిగిలిన పదాలు ఉంటే, అవి దేశ్యాలతో
తెలుగైనా అది జానుతెనుగు అనిపించుకోదు.

జానుతెనుగు, దేశ్యాలు, అచ్చుతెనుగు - ఈ
మూడూ ఒకే అర్థంలో ప్రయోగించబడ్డాయని కొందరి
భావన. కాని నన్నెచోడుని కావ్యంలో తత్సమ శబ్దాలు
కోకొల్లలు. పాల్కురికి రచనల్లోనూ అంతే. కనుక
జానుతెనుగు యయాతిచరిత్రాదుల్లోని అచ్చుతెనుగ
వేరు. (8) కేతన ఆంధ్ర భాషా భూషణం లో చూపిన
పట్టికలను బట్టి జాను తెనుగు అచ్చుతెనుగు
కంటె విలక్షణమైందని తెలుస్తోంది.

మొత్తమ్మీద - నిఘంటువులకు పరిమితమైన . . .

సంస్కృతపదాలు , వ్యవహారం లో లేని మాండలికాల

అచ్చతెలుగు పదాలు గాక నిత్యవ్యవహారం లోని

సంస్కృతాంధ్ర శబ్దాలను ఎన్నుకున్న రచనా రీతి జానుతెనుగు.

~~సులభంగా అర్థమయ్యే దేశకవితకే ప్రాధాన్యత జానుతెనుగు~~

~~అర్థం~~

# ప్రాఙ్నన్నయ యుగ శాసన సాహిత్య స్వరూపం

## వచన శాసనాలు

1) మొట్టమొదటి తెలుగు శాసనం ధనంజయుని కలమళ్ళ శాసనం (క్రీ.శ. 575)

2) జయసింహవల్లభుని విప్పర్ల శాసనం (క్రీ.శ. 641-49 ప్రాంతం) వల్ల నాటికే సంభారవంతమైన వికాసవంతమైన తెలుగు రచన రూపొందిందని తెలుస్తుంది.

"స్వస్తి శ్రీమత్ సకల లోకాశ్రయ జయసింహ వల్లభ మహారాజులాయన ---"

## పద్య శాసనాలు

1) తొలి పద్యశాసనం తూ.చా. గుణగ విజయుని పండరంగని అద్దంకి శాసనం (క్రీ.శ. 848) -

| సంబంధిత వ్యక్తులు | శాసనం & కాలం | విషయం |
|---|---|---|
| పండరంగడు | అద్దంకి (క్రీ.శ. 848) | తరువోజ + 4 పంక్తుల వచనం |
| పండరంగడు | కందుకూరు | సీసము + ఎత్తుగీతి లేనిది + తత్సమ పద ప్రయోగం |

చాళుక్యభీముడు — ధర్మవరం (క్రీ.శ. 897) — సీసము, ఎత్తుగీతి ఆటవెలది

సీసపద్యం ఏ పాదానికాపాదం తెగిపోతూ దేశ్యపద భూయిష్ఠంగా ఉంది.

యుద్ధమల్లుడు — బెజవాడ (885) — 4 మధ్యాక్కరలు + 7 పంక్తుల వచనం

———— — గంగాధర (10 వ శ.) — 3 కందాలు

కన్నడ భాషా ప్రభావం ఉంది

ఇందులో యతిమైత్రి లేదు..

కన్నడలోలాగా య.మై. లేదు.

విరియాల కామసాని — గూడూరు (క్రీ.శ.1000) — మూడు చంపకమాలలు రెండు ఉత్పలమాలలు

అచ్చతెనుగు, దేశ్యపద మిశ్రితమైన రచన

'అసమ మర్కటయుద్ధసురాళి' 'పాండవ మధ్యముని భీముండో యర్జునన్' వంటి ప్రౌఢ ప్రయోగాలున్నాయి.

# సంస్కరణోద్యమ సాహిత్యం (1880-1920)

ఆధునిక తెలుగు సాహిత్య చరిత్ర లో ఆలోచన ను గాఢంగా ప్రభావితం చేసిన ఉద్యమాల్లో ఒకటి సంస్కరణోద్యమం. సంస్కరణ అన్న పదం 'Reformation' అనే ఆంగ్ల పదానికి అనువాదం. [యూరోప్ లో వచ్చిన Reformation Movements ని మనవాళ్ళు పాశ్చాత్య విద్య ద్వారా తెలుసుకున్నారు. ఆ స్ఫూర్తి లో పాటు ఆంగ్లేయుల కున్న ఏదో గొప్పతనం వల్ల వాళ్ళు ఆధిపత్య సంపాదించగలిగారు, ఆ గొప్పదనం మనమూ సంపాదిద్దాం అన్న స్ఫూర్తి కూడా సంస్కరణవాదుల వెనుక ఉంది. అయితే మనకీ ఒకప్పుడు గొప్ప సంస్కృతి ఉందని, దాన్ని పునరుద్ధరించుకోవాలి ఉందనే అభిప్రాయం కూడా వారికి ఉంది.]

సంస్కరణ వాదులు మతవ్యతిరేకులు కాదు, దాని మౌలిక హేతుదృష్టి లో చూసి మూఢవిశ్వాసాల్ని ఖండిస్తారు. మంచి-చెడు నిర్ణయం చేయడానికి శాస్త్రాల్ని ఆధారం గా చేస్తారు. అలాగే మన ప్రాచీన సంస్కృతి ఘనమైందని విశ్వసించారు కాబట్టి వారు చేపట్టే ఏయే సంఘసంస్కరణ కార్యకలాపాలకి వేదాలు, స్మృతుల ప్రామాణ్యం కోసం ఆధార పడడం కన్పిస్తుంది.

సంస్కరణ ఉద్యమ వాదులు ప్రధానం గా వేశ్యారాధనం నిర్మూలించడం, విగ్రహారాధనం ను నిరసించడం, బాల్య వివాహాల్ని వ్యతిరేకించడం, స్త్రీ విద్యని, వితంతు వివాహాల్ని ప్రోత్సహించడం, 'సతి' నిర్మూలన కి కృషి, ముఖ్యంగా మన ఆంధ్రప్రాంతంలో బ్రాహ్మణుల దురాచార

నిషేధానికై కృషి ఇంకా కులభేదాల్ని, కట్టుబాట్లని ఖండించడం వంటివి చేశారు. అయితే సంస్కరణవాదులు ప్రధానంగా మితవాదులు వీరికి తీవ్రవాద భావాలు లేవు. వీరు మన కుటుంబవ్యవస్థ, వివాహవ్యవస్థ వంటి సంప్రదాయాలు గొప్పవని విశ్వసిస్తారు.

సంస్కరణవాదులకి జాతి పోరాటాల మీద నమ్మకం లేదు. ఆంగ్లేయుల పాలన భారతదేశానికి మేలు చేస్తుందని వీరు విశ్వసించారు.

ఇటువంటి సంస్కరణ ఉద్యమ భావకాలం లో ఉత్తర భారతదేశంలో బ్రహ్మసమాజం, ఆర్యసమాజం ప్రసిద్ధమయ్యాయి. మన ఆంధ్రప్రాంతం లో బ్రహ్మసమాజం కోస్తా ప్రాంతాన్ని ఆర్యసమాజం తెలంగాణా ప్రాంతాన్ని ప్రధానంగా ప్రభావితం చేశాయి. ఆర్యసమాజం ప్రధానంగా హిందీ ప్రచారాన్ని ప్రోత్సహించడం వల్ల తెలంగాణా లో తెలుగు సాహిత్యవికాసానికి సంస్కరణ ఉద్యమం అంతగా తోడ్పడలేదు. కాని కోస్తా లో బ్రహ్మసమాజ ప్రభావం తో నడుస్తున్న సంస్కరణోద్యమానికి గొప్ప సాహితీవేత్త అయిన వీరేశలింగం గారు నాయకుడవడం తో సంస్కరణోద్యమ భావకాలం గల తెలుగు సాహిత్యం వికసించింది. ఆయనే గాక మరెందరో సంస్కరణోద్యమ భావాల తో సాహిత్యాన్ని వెలువరించారు. వారిలో గురజాడ అప్పారావు గారు కాళ్ళకూరి నారాయణరావు, భోగరాజు నారాయణమూర్తి, మంగిపూడి వెంకటశర్మ వంటివారు పేర్కొనదగినవారు.

# కందుకూరి వీరేశలింగం గారు

వీరేశలింగం గారు ప్రధానంగా సాహిత్యవేత్త. ఆయన రచనలన్నీ సంఘసంస్కరణోద్యమ రచనలు కాదు. కాని ఆయన రచనల్లో ప్రముఖ భాగం సంఘసంస్కరణోద్యమ రచనలని చెప్పవచ్చు. ఆయన తన సంఘసంస్కరణోద్యమ భావజాలాన్ని వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారా అందించారు.

1) ఉపాఖ్యానం : 'అభాగ్యోపాఖ్యానము' లో వీరేశం గారు హాస్యం పూర్వకమైన సంఘ సంస్కార దృష్టి ప్రదర్శించారు.

2) నాటకాలు : వీరేశం గారు బాల్య వివాహాల వల్లే నిర్బంధ వైధవ్యం ప్రాప్తిస్తున్నదని శుద్ధ వ్యావహారిక భాషలో "బ్రాహ్మ వివాహం" రాశారు. ఇది 'పెద్దయ్యగారి పెండ్లి ప్రహసనం' గా పేరొందింది. న్యాయశాస్త్ర వివరాలు సామాన్యులకు చెప్పేందుకు రాసిన "వ్యవహార ధర్మ బోధిని" ప్లీడరు నాటకం గా పేరొందింది. ఈయన 'స్త్రీ పునర్వివాహం' 'సభానాటకం' అనే సాంఘిక రూపకాల్ని కూడా రాశారు.

3) నవలలు : "రాజశేఖర చరిత్ర" లో తెలుగు పల్లెల్లో ఉన్న మూఢ విశ్వాసాలు, దురాచారాలు, దురభిమానాలు, మతస్థులు, మోసాలు, భూత వైద్యాలు ఎన్నో వర్ణించి ఎండగట్టారు. "సత్యరాజా పూర్వదేశ యాత్రలు" లో సమాజం లో గల వికృత సంఘటనల్ని హేళన చేస్తూ హాస్యరస కల్పనలు చేశారు.

1883 లో "సత్యవతీ చరిత్రము" అనే స్వతంత్ర నవలలో స్త్రీవిద్యాభివృద్ధినీ, స్త్రీ ప్రాధాన్యాన్ని ప్రబోధిస్తూ రచించారు. 1884 లో రాసిన "చంద్రమతీ చరిత్రము" లో చంద్రమతి స్వయంగా విద్యావంతురాలు కావడమే గాక రాజ్యమంతటా బాలికా పాఠశాలలు స్థాపిస్తుంది. స్త్రీల కోసం వీరేశం "సత్య సంజీవని" అనే నవల కూడా రాశారు.

4) ప్రహసనాలు : ఆంగ్ల నాటకాల ప్రభావం వల్ల రాజకీయ, సాంఘిక దురాచారాలను వినోదకరంగా, సంభాషణాత్మకంగా వివరించి మార్పించాలనే సంఘ సంస్కరణ దృష్టితో అనేక ప్రహసనాల్ని రచించి తన 'వివేక వర్ధిని' లో ప్రచురించేవారు.

'జమాబందీ' 'యోగాభ్యాసము' ల్లో కులాచారాల్ని ఆక్షేపించారు. 'బహు భార్యాత్వం' 'బాల భార్యా వృద్ధ భర్తృ సంవాదం' వంటి ప్రహసనాల్లో నాటి సాంఘిక దుస్థితి వెల్లడి అవుతుంది. 'భ్రాంతి తరంగిణి' స్త్రీ విద్య పై రాయబడ్డ ప్రహసనం. పరిశోధకుల ప్రకారం ప్రకటించబడ్డ 44 ప్రహసనాల్లో 15 మూఢవిశ్వాసాల్ని ఖండన చేసేవి కాగా 21 సంఘ సంస్కారాన్ని బోధించేవి ఉన్నాయి.

5) కథలు : వీరేశం గారు కథా రచన ని ప్రధానం గా స్త్రీజనోద్ధరణ కోసం చేపట్టారు. స్త్రీల పత్రిక "సతీహిత బోధిని" ని నడిపి స్త్రీవిద్య ని ప్రోత్సహించే, సాంఘిక

" ముద్దియ విద్దె పెద్ద కార్యాలు " అంటూ స్త్రీ విద్యను సమర్థించే రచనను పద్యాలలో కూడా రాశారు.

ఈ విధంగా వీరేశలింగం గారు వివిధ ప్రక్రియల్లో సాంఘిక సంస్కరణోద్యమ సాహిత్యాన్ని వెలయించి తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసేందుకు తోడ్పడ్డారు.

## గురజాడ అప్పారావు గారు :

గురజాడ ప్రధానంగా ఆధునికుడు. సంస్కరణోద్యమం లో ఆధునికత కు అనుకూలంగా ఉన్న వాటిని సమర్థించి ఆధునికత కు వ్యతిరేకంగా ఉన్న వాటిని నిర్మొహమాటంగా విమర్శించాడు. (అందువల్ల గురజాడ రచనల్లో సంస్కరణోద్యమ అనుకూల, వ్యతిరేక రచనలు రెండూ ఉంటాయి. సంస్కరణ వాదులు వీరేశలింగం గమనించ గల అర్హతలు, కాని గురజాడ నాస్తికుడు ఆ విషయాలను గమనించ దగిందే.)

"కన్యాశుల్కం" నాటకం లో కన్యాశుల్కాన్ని దురాచారం గా ఖండించారు. అలాగే 'మధురవాణి' పాత్ర ద్వారా వేశ్యా వ్యవస్థ ని వ్యతిరేకించారు.

గురజాడ కథానికల్లో "దిద్దుబాటు" లో కమలిని, "మీ పేరేమిటి" లో సాంబారమ్మ ఆయన సోదాలన్ని చేతల ద్వారా సూచించారు. "భగవంతుడి సృష్టిలో కల్లా ఉత్కృష్టమైన వస్తువు విద్య నేర్చిన స్త్రీ రత్నమే" అని దిద్దుబాటు లో ప్రకటించారు. "మీ పేరేమిటి" లో మూఢాచారాల్ని "మతము - విమతము"

లో మత మౌఢ్యాన్ని గురజాడ నిరసించారు. "సంస్కర్త హృదయం" లో వేశ్యా వ్యతిరేకాన్ని వ్యతిరేకించడమే గాక సంస్కర్తల హృదయాల్లోని డొల్లతనాన్ని ఎండగట్టారు.

"ముత్యాల సరాలు" కోయకండెక్ లోని కొన్ని ఖండికలు కూడా సంస్కరణోద్యమ భావాలకు దగ్గరగా ఉంటాయి. 'లవణరాజు కల' లో వర్ణాంతర వివాహాల్ని సమర్థించే రచన, 'పూర్ణమ్మ' లో కన్యాశుల్క దురాచారాన్ని ఖండించడం, 'మనిషి' లో మనిషిలో దేవుణ్ణి చూడమనడం, లాంటి భావాలు కన్పిస్తాయి.

సంస్కరణోద్యమాల్లోనూ గురజాడవారు కూడా ఆలోచనల్ని సమర్థించినవారే. 'కన్యాగానని మధ్యతల్లులు వెంకటేశ్వరు లింగరాజులు, కల్లునాల్లరు; వారి విద్యల రాబ సత్యాలు నరసింహ' నని చెప్పుకొన్నారు.

ఇతర రచయితలు :

కన్యాశుల్కం మీద చర్చ జరుగుతున్న ఆ రోజుల్లోనే వరకట్న సమస్య మీద కూడా ధ్వజమెత్తిన వ్యక్తి సంస్కరణ రచయిత కాళ్ళకూరి నారాయణరావు గారు. ఆయన "వరవిక్రయం" నాటకం వరకట్న సమస్యకు వ్యతిరేకంగా నిరసన అభివ్యక్తి లో చేసిన కళాత్మక రచన. "చింతామణి" నాటకం వేశ్యా సంస్కరణ వస్తువుగా గల రచన. మద్య పాన నిషేధాన్ని కోరుతూ "మధుసేవ" నాటకం రాశారు.

సంఘ సంస్కరణ ఉద్యమ ప్రభావం లోనే కావ్యకృతులు

సంబంధించి పెద్ద ఖండ కావ్యాలు వెలిశాయి. వాటిలో

భోగరాజు నారాయణమూర్తి గారి 'విధవా విలాపము'

'పండుగ కట్నములు' ; మంగిపూడి వెంకట శర్మ గారి

'బాల వితంతు విలాపము' 'అబలా విలాపము'

చెప్పుకోదగినవి.

ఈ విధంగా తెలుగు సాహిత్యంలో సంస్కరణ ఉద్యమం వివిధ ప్రక్రియల్ని ప్రభావితం చేసింది. అయినా సంస్కరణ ఉద్యమం ఒక ఉద్యమం గా ఆంధ్రదేశంలో బలంగా సాగినా సాహిత్యపరంగా మాత్రం మిగిలిన సాహిత్యోద్యమాలంత గా అధిక సాహిత్య రాశి ని సృష్టించ లేదని విమర్శకుల అభిప్రాయం.

గురజాడ వారి తర్వాత గేయాలలో సంఘ సంస్కరణ దృష్టి పత్రధారాధారాళంగా వెలార్చుతుంది. ముత్యాల సరాలలో మొదటి గేయం లోకంచుక్క పొడుచుట వలన ఏదో అర్థం సంభవిస్తుందనే మూఢవిశ్వాసాన్ని ఖండించ-డానికి రాసింది. లోకంచుక్క ని ఆయన 'సంఘసంస్కరణ ప్రయత్న పతాక' గా భావించారు. తన 'లవణ రాజు కల' గేయం లో

'మలిన దేహుల మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే'

అని మాలయన్న భేదం కులాన్ని బట్టిగాక మనస్సుని బట్టి కులాలని ప్రతిపాదించి వర్ణవ్యవస్థ లోని చెడుని ఖండించారు.

'మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచియన్నది మాలయైతే
మాలనే అగుదున'

అని కులవ్యవస్థ ని తీవ్రస్వరం లో ఖండించారు. ఈయన తన 'పూర్ణమ్మ' లో వృద్ధవివాహాన్ని నిరసించారు. కాసుకు లొంగి కన్నెల్ని ముసలివారికి ముడివేసే దురాచారాన్ని ఖండించి అలాంటి అక్రమాలకి లోనైన పూర్ణమ్మ లాంటి కన్నె బాలికల్ని కి వాళ్ళిప్పుడే విషాదాన్ని కడు కరుణరసాత్మకం గా చిత్రించి సంఘం లోని

మొరటుతనాన్ని పెక్షించ వలసియుంది.

— o —

~~స్త్రీ జనోద్ధరణ విషయంలో అనంతరం సంస్కరణోద్యమ రచయితల్లో మార్పు చాలా తీవ్రమైన రీతిలో ఉంది. ప్రేమ కోసం సామాజిక ధర్మాల్ని త్యజించవచ్చుని తెల్పి ఉంటారు వారి పాత్రల్ని నిరంకుశ భావాల చట్రం బద్దలు కొట్టి సంస్కరణ భావాల్ని కొత్త పథం లోకి ప్రవేశపెట్టారు.~~

— o —

మార్క్సిస్టు సిద్ధాంతం ఆధారంగా రచన చేయడం ప్రారంభించిన అభ్యుదయ రచయితలు సాంఘిక సంస్కరణాల కంటే ఆర్థిక వర్గాల మీద ఆధారపడ్డ సమాజమైన సామాజిక విప్లవం ముఖ్యమని ప్రతిపాదించారు ముందుకు సాగడం లో సంస్కరణోద్యమం పాతబడ్డ ధోరణి అయిపోయి వెనుకబడి పోయింది.

సంస్కరణోద్యమాలు ఈ దశాబ్దిలో సమాంతరంగా సాగిన జాతీయోద్యమం తర్వాతి కాలంలో సంస్కరణోద్యమం వారి ఆశయాల సంస్కరణ కార్యకలాపాల్ని కూడా తమ సొంత కార్యాచరణ ప్రణాళికల్లో చేర్చుకోవడం లో ఈ సంస్కరణోద్యమం ఒక ప్రత్యేక ఉద్యమంగా తన అస్తిత్వాన్ని నిల్పుకోలేకపోయింది / కోల్పోవాల్సివచ్చింది.

## పోతన కవితా రీతులు Intro - పంచ భౌతిక శరీరం + 2



~~ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో సమున్నత స్థానాన్ని పొందిన మహాభక్తాగ్రణి బమ్మెర పోతన. ఆంధ్రమహాభాగవతం తెలుగులకందించి అభిమానపాత్రుడైన కవిచంద్రుడు పోతన. ఇతను పదునైదవ శతాబ్దపు ఉత్తరార్థమునందలివాడు. సహజ పాండిత్యుడు, శ్రీరామ భక్తుడు.~~

"పలికెడిది భాగవతమట
పలికించెడు వాడు రామభద్రుండట ..." అని

చెప్పుకున్న పోతన తన కావ్యాన్ని శ్రీ రామచంద్రునికే అంకితమిచ్చి తన కవితా పరమార్థం భక్తితత్వాన్ని వెల్లడించడమేనని చాటాడు.

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం మూడూ కలిసి సమపాళ్ళల్లో ఉన్న భక్తి సంపన్నుడు పోతన. అతని మనస్తత్వానికి తగినట్లు రచించబడిన భాగవతం లో ఉన్న మహాత్మ్య కవిత్వ పటుత్వ సంపద అన్యులకు అసాధ్యమైనది. భాగవత అవతారిక లో పోతన తన కవితా గుణాలను ఇట్లు చెప్పాడు

ఉభయ భాషా ప్రావీణ్యం

కొందఱికి దెనుఁగు గుణమగు
గొందఱికిని సంస్కృతంబు గుణమగు రెండున్
✓ గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

ఇట్లు చెప్పిన దానిని చేతలలో నిరూపించాడు

పోతన.

" విశాలేంద్రుడవో (వృత్తుకైవడి ..... శ్రీకరుడ" అనే
పద్యంలో ఎంతటి సంస్కృత పదాలు ప్రయోగించాడో

" ఓ యమ్మ ! నీ కుమారుడు
మా యిండ్ల ను పాలు పెరుగు మననీడమ్మ -- " అనే
పద్యం లో అచ్చంగా తెలుగు పదాలను ప్రయోగించి తన
భాగవతాన్ని అందరిచేత ~~ఆదరణ~~ ఆదరం పొందేట్లు చేశాడు.

అలంకార ప్రయోగం - అక్షర రమ్యత

" తెలుగు భాష మాధుర్యము ను చవిచూడ
వలెనన్న భాగవతమునే పఠింపవలయును. పోతన కవిత్వమున
అక్షర రమ్యత మెండు " అని దివాకర్ల వేంకటావధానిగారన్నది
నిజం. పోతన కవితా మాధుర్యానికి శబ్దాలంకారాలు ముఖ్య
కారణాలు.

" అడిగెదనని కడువడి జను
నడిగిన --- " డ కార వృత్త్యనుప్రాస

'తేమా దనుజుల గెలువగ లేమా'
'మామా పలుకులు మొట్టుగ మామా' వంటి యమకాలూ

'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' వంటి లాటానుప్రాసలూ
ఛేకానూ శ్లేషలూ, ద్విప్రాసలూ, త్రిప్రాసలూ, అంత్యానుప్రాసలూ,
వైచిత్ర్యాలంకారాలూ సహజంగా ఉండి శ్రవణానందాన్ని కలిగించి

నిత్య వ్యవహారాలకి అనుగుణంగా ఉంటాయి.

సమస్త కళలను మంత్రశాస్త్రములను కవిత్వమున ఛందో నిబద్ధముగ శబ్దమెంతవరకూ సాధింపగల్గునో పోతన వలె ధృవప్రమాణంగా చూపిన పురాణకవి ఇంకొకడు లేడు. ఛందస్సంభవమైన మాధుర్యమును వలె నింకొక కవికి లభ్యము గాలేదు. ఆయనకు గల శబ్దాలంకార ప్రయోగములు దీనికి మరింత వన్నె పెట్టింది. సముచిత ప్రయుక్తమైన చోట్లనది భాగవత కవిత్వానికి మృదుగ వ్యవహారములను ఉదహరించుకొందాము.

పోతన శబ్దాలంకారములతో పాటు అర్థాలంకారములకు సముచిత స్థానమిచ్చి కావ్య గౌరవమును ఇనుమడింపజేసెను.
"శుక్ల [illegible] మందలి
" బాలేందు రేఖ దోచిన ---- " అను పద్యమందలి
ఉపమాలంకార రామణీయకత ఎంతో మనోహరమైనది.

పోతన "వచన" రచనలో బాణు 'కాదంబరి' వలె శ్లేష విరోధాభాసలను చోటుచేసుకొన్నవి. గజేంద్రమోక్ష ఘట్టమున
'మదనమాన సంచారుండయి పోయి పోయి అంత దూరంబున శింశుమార చక్రంబునుబోలె గురుమకర కుళీరమీన మిథునంబై ---"
ఇత్యాది వచనములు పరమోదాహరణములు.

ధ్వని 3

ధ్వని : కావ్యము ధ్వని ప్రధానముగ నుండవలెనని ఆలంకారికుల అభిమతము. భగవంతుని స్వరూపమును

తెలియజెప్పు

" ఒరులు గాదు నాకు ఒరులన్నేనౌదు ... "

అను పద్యాలు బలి చక్రవర్తి కడకు ~~[illegible]~~ యాచకుడిగా వచ్చిన వటువు విష్ణువయినను త్రివిక్రమమూర్తియగు వామనుని యథార్థ వాక్యాలవి. " ఈశావాస్యమిదగుం సర్వం " ఇందలి అది ఇందలి ధ్వని.

4. వర్ణనలు: పోతన వర్ణనలు పాత్ర పోషణకీ, రసస్ఫూర్తికీ దోహదం చేస్తాయి. భగవత్ వర్ణన లో పరమాత్ముని దివ్య మంగళ మూర్తి ని ప్రత్యక్షీకరింపజేయగలడు.

" ఇంతింతై వటుడింతై మరియు దానింతై ... "

పద్యంలో వామన విజృంభణ కళ్ళకు కట్టినట్లుంటుంది.

" పాలమున్నీటి లోపలి మీది మీగడ మిసిమి జిడ్డునం జేసి మేను వడసి... "

పద్యం లో సముద్ర మథనం లో లక్ష్మీదేవి పుట్టుక ను వర్ణించిన తీరు మనోహరమైంది.

" ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై " పద్యంలో శివుని వర్ణన మనోహరం!

శ్రీకృష్ణుని బాల్య క్రీడల్ని వర్ణించడంలో, కాళీయమర్దనంలో గోవర్ధనోద్ధరణంలో పోతనకు పోతనే సాటి అనాలి.

5. పాత్ర చిత్రణ: పోతన పాత్రలు రూపురేఖల్లో సజీవంగా తీర్చిదిద్ది మన ఎదుట సాక్షాత్కరింపజేస్తాడు. భాగవతంలో
" నల్లనివాడు పద్మనయనంబులవాడు ... "

వన్నె లేని పాత్ర లేదు. సజీవంగా పాత్ర కనిపించదు.
ప్రహ్లాదుడు, అక్రూరుడు, కుచేలుడు, అజామిళుడు, పెద్దవైన పాత్రలన్నీ
భక్తి శాఖకు కావ్య రూపులే.

'దాత పెంపు సొంపు తలప వలదే' — అన్న మాటల్లో
బలి చక్రవర్తి అహంకారాన్ని ప్రజ్వలింప చేస్తాడు. కంసుని భయం,
దౌర్జన్యాలను ఎలా వర్ణించాడో రంతి దేవుని త్యాగాన్ని అంతబాగా
చిత్రించాడు. సత్యభామ పాత్ర నుంచి గజేంద్రుని పాత్ర దాకా
పాఠకుల మనస్సులో చెరగని ముద్ర వేసేలా చిత్రించాడు పోతన.

~~6 నాటకీయత: పోతన భాగవతం లో నాటకీయత ని
పైతం పండించి దానిని రమణీయకంగా మలిచాడు.~~

~~"నల్లనివాడు పద్మ నయనంబుల వాడు ..." అనే పద్యంలో
శ్రీకృష్ణుని ఆకారాన్ని వర్ణించాడు.~~

~~"సిరికిం జెప్పడు శంఖ చక్రయుగమున్ చేదోయి సంధింపడు ..." అనే
పద్యం లో ఉన్నవాడు ఉన్నట్లే పరుగు పరుగున వస్తున్న విష్ణుమూర్తి
కళ్ళముందుంటాడు.~~

5 పాత్రచిత్రణ:

"అడిగెదనని కడువడి జను" పద్యం లక్ష్మీదేవి అవ్యక్తమైన
ఆందోళని తెలియజేస్తుంది.

"ఘనుడా భూసురుడేగెనో, నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో"
పద్యంలో ప్రత్యక్షరం లోనూ రుక్మిణి మానసిక స్థితి ని చిత్రీకరించిన
తీరు ప్రశంసనీయం.

7. రస పోషణ :- తిక్కన లా రసస్ఫూర్తి పోతనలోనూ గమనించవచ్చు. అయితే పోతన హృదయము భక్తిరసమయమగుటచే ఆ రసమును అత్యద్భుత ఆవేశములో నిర్వహించెను. గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్ర, రుక్మిణీ కల్యాణము, అంబరీషోపాఖ్యానము మున్నగునవి మున్నగు ఘట్టములందులను ఉదాహరణలు. 'భక్తి కూడా ఒక రసమే' అన్న అభిప్రాయం కలిగించిన పోతన భక్తి రసపోషణ అద్భుతము. దీనితో పాటు ఇతర రసాలను కూడా చక్కగా పోషించాడు.

"తిక్కల రాక్షస పిల్లలకు లేవడు సుండీయు ..." అని సప్తమ స్కంధం లో వెలుగాడు సులింగని పట్టుకున్నప్పటి పద్యం కరుణారసమయం.

"రాకేందు బింబమై రవి బింబమై యొప్పు ..." అని నరకాసుర సంహారం లో వీర శృంగారాలను మేళవించాడు.

"పరు జూచున్ వరు జూచు నొంపనలరింపన్ ..." పద్యంలో పోతన రస పోషణ పరాకాష్ఠకు చేరింది.

8. సూక్తి వైచిత్రి :- పోతన భాగవతం లో ఎక్కువగా సూక్తి వైచిత్రి ఉంది.

"పరహితము సేయు నెవ్వడు
పరమ హితుడగు భూతపంచకమునకున్
పరహితమే పరమ ధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ"

'ఊరకరారు మహాత్ములు', 'మాట తిరుగ లేరు మానధనులు' వంటివి సామెతలయ్యాయి.

"వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్త మానభంగములందు ..." అని ఆయా సందర్భాలలో అబద్ధమాడటం తప్పుకాదని సూక్తి. ఇవన్నీ

భాగవతం సూక్తి సుధార్ణవం అని చాటి చెప్తాయి.

1 భక్తి తత్త్వము : భాగవతం వ్రాసిందే భక్తితత్త్వాన్ని ప్రకటించుటకు, అందువలన పోతన కవిత్వం భక్తిమయంగానే ఉంటుంది.

'నీ పాద కమల సేవయు ... నాకు దయసేయగదే!'

'విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే!' (భక్తి ఆవేశం)

'జగతి పుట్టి పుట్టి చచ్చి ---' జీవిత పరమార్థం భక్తి అని తెల్పుతుంది.

'ఇందుగలడందు లేడని ----' పద్యంలో భగవంతుని సర్వాంతర్యామిత్వం : కృష్ణ తత్త్వం వివరించబడింది.

గోపికలది మధుర భక్తిగా, కుంతీదేవిది త్యాగభక్తిగా, రుక్మిణిది వాల భక్తిగా, కుచేలునిది మిత్ర భక్తిగా, బలిచక్రవర్తిది ఆత్మ నివేదనతో కూడిన భక్తిగా పోతన వెలయించి తన కవిత్వాన్ని భక్తిమయం చేసుకున్నారు. హిరణ్యకశిపునిది వైరభక్తిగా

నన్నయ ధారాశుద్ధి, తిక్కన రసస్ఫూర్తి బంధము, ఎర్రన సూక్తి వైచిత్రి, సోమని సాంకేతి విదగ్ధత, శ్రీనాథుని [illegible] పటుత్వములు ఇవ్వియును ఒక రూపంలో పోసిన పోతన శైలి పాంచ భౌతిక శరీరము. దానికి పోతన సహజ పాండిత్యము, భక్తి తత్త్వము నూ చేరి ఆంధ్ర సాహిత్యమున అత్యుత్కృష్టమైన స్థితి నొందినది.

వామనావతార ఘట్టము లో పోతన అసాధారణమైన

10 కవిత్వ పటుత్వము ను ప్రదర్శించాడు, అందుకు ఉదాహరణగా

" ఆదిన శ్రీసతి కొప్పుపై తనువుపై -- " అను పద్యంలో

బలి చక్రవర్తి ఆలోచనా వైఖరి ని పోతన రసాత్మకముగా, సముదాత్తముగా

మధుర భావయుతంగా చిత్రించిన తీరు చెప్పవచ్చు.

11) ఆత్మీయత : భాగవత రచనలో పోతన ఆత్మీయత

ప్రతిబింబించింది. ఆత్మాశ్రయ స్వభావం ఉదయించింది. భక్తుల

పాత్రలలో పోతన పరకాయ ప్రవేశం చేసి / చేసి పలుకుతున్నాడా

అన్నంత తాదాత్మ్యం వెల్లివిరిసింది.

" లావొక్కింతయు లేదు -- " అన్నప్పుడు గజేంద్రుడు

పోతన గానే తోస్తాడు.

నాటకీయత : క్షీర సాగర మథనమును వర్ణించునప్పుడు పోతన

అమూలకముగ కల్పించిన శివ పార్వతుల సంభాషణ ఆతని

నాటకీయత కు చక్కని ఉదాహరణ.

శివుడు హాలాహలము ను భక్షించుటకు పార్వతి

యొక్క అనుమతి ని కోరుచు

" కంటే జగముల దుఃఖము -- "

" పరహితము సేయు నెవ్వడు -- " అను పద్యముల ను

చెప్పగా పార్వతీ దేవి

" మ్రింగెడి వాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో " అని తన

[illegible] ను ప్రదర్శించింది.

భాగవతము నందు రసరంజితములగు సన్నివేశము

లనేకములున్నవి. అశ్వత్థామ నిరపరాధులైన ద్రౌపదీయులను

(12) కవి వ్యక్తిత్వం కావ్యం లో ప్రతిబింబించిన తీరు

నిద్రలో చంపినాడు. అతనిని పాండవులు బంధించి తెచ్చి

ద్రౌపదికందించినారు. తన పుత్రులను చంపిన అశ్వత్థామ

ను పరుష వాక్యములతో తూలనాడి చిత్రవధ చేయక

ద్రౌపది తల్లివలె మృదువుగా ~~[illegible]~~ కరుణాపూరితముగా

ఇట్లు మందలించినది.

12 - 1 = 11

“భూసురుఁడవు బుద్ధిదయా భాసురుఁడవు ----

— --- నకటా నీ చేతు లెట్లాడెనో ?”

ఈ మాటలలోని మార్దవము పోతన

హృదయ మార్దవమునకు ప్రతిరూపము.

* సంస్కృతాంధ్రపద భూయిష్ఠ / భారితమైన రచనకుదాహరణము

“సిరికిం జెప్పఁడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింపఁడే

— —

— —

గజప్రాణావనోత్సాహియై”

1. ఉభయ భాషా ప్రావీణ్యం
2. అక్షర రమ్యత + అర్థాలంకారాలు + వచన రచన
3. ధ్వని
4. వర్ణనలు
5. రస పోషణ
6. పాత్ర చిత్రణ
7. కవిత్వ పటుత్వం
8. ఆత్మీయత
9. భక్తి తత్త్వం
10. పాంచభౌతిక శరీరం
11. సూక్తి వైచిత్రి
12. కవి స్వభావం – మార్దవం

# పోతన అనువాద విధానము

*look at the gist first*

ఆంధ్ర వాఙ్మయము న సమున్నత స్థానము ను పొందిన మహాభక్తాగ్రణి బమ్మెర పోతన. 'ఆంధ్రమహాభాగవతము' ను ఆంధ్రుల కందించి వారికి ఆప్తుడైన కవిచంద్రుడతడు. ఇతడు పదిహేనవ శతాబ్ది ఉత్తరార్ధము నందలి వాడు. సహజ పాండిత్యుడు, శ్రీరామచంద్ర భక్తుడు.

12 స్కంధాల భాగవతంలో పోతన 1 నుండి 4, 7 నుండి 10 స్కంధాలను తెనిగించగా బొప్పరాజు గంగన 5 వ స్కంధాన్ని, ఏర్చూరి సింగన 6 వ స్కంధాన్ని, వెలిగందల నారయ 11, 12 స్కంధాలను రచించి భాగవతాన్ని పూర్తి చేశారు. పోతన యే తన శిష్యులకు, మిత్రులకు భాగవత రచన లో భాగం పంచి ఇచ్చాడని ఆధునిక / నేటి విమర్శకులంటున్నారు. భక్తాగ్రగణ్యుడగు పోతన మహాకవి భాగవతాన్ని ఆంధ్రీకరించుట ఆంధ్రుల అదృష్టము.

భాగవతము ను ఆంధ్రీకరించుటకు కావలసిన బహుశక్తి చాలదు. వేదాంత పరిజ్ఞానము, నిరుపమాన వైదుష్యము, కర్మాచరణము, అన్నిటిని మించి వైరాగ్యముతో కూడిన అచంచల భక్తి ఉండవలెను. పోతన వేదాంతి, విద్వాంసుడు, కవి, విరాగి, పరమ భక్తాగ్రేసరుడు. కావుననే జన్మ రాహిత్యమగు మోక్షము ను లేక భాగవతాంధ్రీకరణ ను అదృష్ట ఫలముగా భావించి నిర్వర్తించినాడు.

95 ... మూలము ను ఆధారముగ చేస్తున్నప్పటికీ

write పింగళి లక్ష్మీకాంతం quotation

దానికి తన హృదయమందలి భక్త్యావేశమును చేర్చి మనకందించాడు. భక్తి ఆవేశము చేతనే మూల భావాలకు తన భావాలను కూడా జత చేసినాడు. అద్వైత విషయాలను బోధించేటప్పుడు సుప్రసిద్ధ శ్రీధరీయ వ్యాఖ్య ను కూడా అనుసరించినాడని కొందరు సాహిత్య విద్వాంసులు గుర్తిస్తున్నారు. ఇతర పురాణ విషయాలను కూడా జొప్పించినాడు. అందుకే ఆంధ్ర భాగవతము మూలము కంటె మూడింతలు పెరిగింది.

I అమూలక రచన

కథారంభమున గల నైమిశారణ్య(1) వర్ణనము కు మూలము లేదు. అట్లే అష్టమ స్కంధమున కూర్మావతార ఘట్టమున చేయబడిన మహాకూర్మ(2) వర్ణనము, సముద్ర మథన(3) వర్ణనము, హాలాహల(4) విజృంభణ వర్ణనము సొంతములే. (x),

వామనుడు తన మూర్తిని విశ్వవ్యాప్తముగా పెంచునపుడు చెప్పిన

1) "రవిబింబముపమింప బాత్రమగు ఛత్రంబై ---" పద్యము లోని రూపకల్పన పోతన ప్రతిభాజన్యము. భాగవతము నలంకరించిన మూలాధారము లేని ఇట్టి పద్య రత్నములు వందల కొలది గలవు. (x)₂ అట్టి వాటిలో అగ్రగణ్యమైనది గజేంద్రమోక్ష ఘట్టములోని

2) "లావొక్కింతయు లేదు ..." అన్న పద్యం. భక్తిం పరాయణత్వమునకు పరమావధియైన దగిన ఈ పద్యము మూలమున లేదు.

3) "సిరికిన్ చెప్పక శంఖ చక్రయుగమున్ చేదోయి సంధింపక ---"

శ్రీమహావిష్ణువు సంరంభము లో వైకుంఠము నుండి దిగి వచ్చుట పోతన భావించి చిత్రించిన సన్నివేశము.

ఇంకనూ దశమ స్కంధము లో రాసక్రీడ సందర్భమున గల రసగుళికలని చెప్పదగిన పద్యములు మూలము మృగ్యము. ఆంధ్రులకెల్లరకు మహావిధేయమైయున్న

4) "నల్లని వాడు పద్మ నయనంబుల వాడు ---" అనే పద్యం పోతన పెట్టిన భిక్షయే / అమృత భిక్షయే.

II మూలాన్ని విపులీకరించుట

భగవంతుని గుణగణాలను వర్ణించేటప్పుడు మూలంలో కంటె విపులంగా, తనివితీర వర్ణించి తన భక్తి భావాన్ని ప్రకటిస్తాడు. మూలంలో ప్రహ్లాదుడు నవవిధ భక్తులను గురించి చెప్పిన శ్లోకములు రెండు గలవు.

"శ్రవణం కీర్తనం ---- నివేదనమ్"

"ఇతి పుంసార్పితా ---- ధీతముత్తమం"

ఈ శ్లోకాల భావాన్ని పోతన

"తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ ----"

అనే పద్యంలో వివరించినా తృప్తి చెందలేదు. ఆ భావాన్ని మరింత విస్తరించి భక్తి లేని వారి జీవితాన్ని

"అంధేందూదయముల్ ---"

"కమలాక్షు నర్చించు కరములు కరములు ---"

"కంజాక్షునకు గాని కాయంబు కాయంబె ---"

"సంసార జీమూత సంఘంబు విచ్చునే ---"

అనే పద్యాలలో వివరించి కవితా రామణీయకతలతో పాఠకులకు ఆమందానందాన్ని కలిగిస్తాడు.

III అనౌచిత్యములను పరిహరించుట

(x) బలి చక్రవర్తి వామనుల మధ్య గల సంభాషణలో "నప్పమాన మారుప ----" అంటూ నన్ను యాచించినవాడు మళ్ళీ మరొకర్ని యాచించ వలసిన అవసరం ఉండదు అనే భావం ఉంటే పోతన అది సంభాషణౌచిత్యంగా లేదని దాన్ని వదిలేశాడు. పైగా 'పసిబాలుండవు' అంటూనే యువతులన వీక్షించి కాంక్షించితివా! అనటం అది అనౌచిత్యంగా కన్పించడు. అందుకే పోతన దాన్ని వదిలివేశాడు.

I అమూలక రచన

బలి చక్రవర్తి శుక్రుని మాటను పాటింపక తన ధర్మాత్మతను కానియాడు కానిన

5) "ఆదిన శ్రీ సతి కొప్పుపై, తనువుపై, నంసోత్తరీయంబుపై --" అనే పద్యాలకు మూలము లేదు.

అట్లే క్షీరసాగర మథనమును వర్ణించు సందర్భమున పోతన అమూలకముగ శివ పార్వతుల సంభాషణము;

6) నాటకీయంగా కల్పించి చిత్రించాడు.

శివుడు హాలాహల భక్షణకై పార్వతి అనుమతిని

"కంటే జగములు దుఃఖము
వింటే జలజనిత విషము వేడిమి ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటింపగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ!" అని

"పరహితము సేయు నెవ్వడు
పరమహితుండగు భూత పంచకమునకున్
బరహితమే పరమ ధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ!"

అని శివుడు పార్వతికి నచ్చ చెప్పగా, పార్వతి

"మ్రింగెడువాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మదినమ్మినదో!"

అని తన పతిదేవుని పట్ల అతి విశ్వాసము ప్రకటించినది. పరోపకార పరాయణత్వమును, త్యాగశీలతను సులభముగా బోధించుచున్నవి పద్యములు. విశ్వశ్రేయమే కావ్య లక్ష్యము కదా! ఇట్టి విశేషములను ఉపదేశించుటకు, అమూలకముగ సహజ సిద్ధముగ సులభశైలిలో పద్యములు పోతన కల్పించి భక్తులకు ప్రీతి కలిగించినాడు.

ప్రహ్లాద చరిత్రము, గజేంద్ర మోక్షము, వామన చరిత్ర, రుక్మిణీ కల్యాణము, కుచేలోపాఖ్యానము మొద

ఘట్టములలో మూలము కంటె విశేషముగ విపులీకరించి తెలుగు ప్రాంత్య పాఠకులకు భాగవత మహార్ణవము ను ఆంధ్ర ప్రపంచమునకు అందించిన ధన్యజీవి పోతన. / పోతన ధన్యజీవి.

మూలంలోని అర్థం గూఢంగా ఉన్నప్పుడు శ్రీధరుని వ్యాఖ్యను అనుసరించి (1) మూలభావాన్ని విస్తరించటం, విశిష్టమైన చోట్ల మూల భావాన్ని స్వీయానుభవంతో (2) పెంచటం, సరసంగాలేని అంశాలను కూడా రసవత్తరంగా (3) రూపొందించటం, కవిత్వ వైచిత్ర్యానికి అనుకూలపడని వేదాంత ఘట్టాలను మృదుపద సంవిధానంతో మనోహరంగా (4) మార్చటం, మూలంలోని ఆత్మ (5) వదలకుండా తెలుగులో భక్తి భావాలతో దానిని పెంచటం, తెలుగులో భక్తితత్వ కనుగుణమైన (6) ఒక శైలిని రూపొందించటం ఇత్యాది పోతన అనువాద విధానాల ద్వారా మూల భాగవతం కంటె ఆంధ్ర భాగవతం సరళ సుందరంగా అలరిస్తుంది. అట్లే ఒక ఘట్టంలోని సౌందర్యాన్ని (7) గుర్తించి దాన్ని రసవత్తరంగా రూపొందించటం మరో విశేషం.

ఇట్టి విశిష్ట అనువాదము చేయటనే భాగవతము తెలుగులో స్వతంత్ర కావ్యమా - అనే విధంగా ఆంధ్రీకరించబడింది. ఈ రూపాంతరీకరణకు పోతన భక్తితత్వమే మూలకారణము.

(*) కొన్నిచోట్ల కథా మాత్ర ప్రాధాన్యము, కొన్నిచోట్ల స్వేచ్ఛానువాదము, కొన్నిచోట్ల అపూర్వ కల్పనలు, కొన్నిచోట్ల భాగవత వ్యాఖ్యాన సంగ్రహ అనువాదము ను కూడా కలవు.

పోతన రచించిన ఆంధ్ర మహాభాగవతం సంస్కృత మూలమైన వ్యాసభాగవతానికి అనువాదం. కాబట్టియూ చాలా వరకు స్వేచ్ఛానువాదమే కాని యథానువాదం కాదు. “ కొన్నిచోట్ల కల్పనలు చెయ్యటం, సంగ్రహించటం, వ్యాఖ్యలలో ఉన్న విశేషాలను వివరించటం, ఇతర సంస్కృత కావ్యాలలో గల భావాలను చేర్చటం” మొదలైన విధంగా పోతన తన భాగవతాన్ని వివిధ రస భరితం చేశాడని ఆచార్య పుల్లెల (శ్రీ)రామచంద్రుడు వివరించారు.

“భాగవతము భారతము వలె కథాప్రధానము గా నడచిన స్వతంత్రానువాదము కాదు. మరి మూలము ను యథాతథముగ అనుసరించిన అస్వతంత్రా-నువాదము ను కాదు. కొన్నిచోట్ల కథామాత్ర ప్రాధాన్యము, కొన్నిచోట్ల శ్లోకానువాదము, కొన్నిచోట్ల అమూలక కల్పనలు, కొన్నిచోట్ల భాగవత వ్యాఖ్యాన సంస్థల అనువాదము ను ఇందు గలవు”

— పింగళి లక్ష్మీకాంతం.

(X)3 బలిచక్రవర్తిని వామనుడు మూడడుగుల నేల అడిగినప్పుడు “దాత పెంపుసొంపు తెలుపవలెనే” అని “ఇదేమి కోరిక?” అంటాడు. ఆ సందర్భము లోని పద్యాలు పోతన చాలా మార్పులు చేసి మిక్కిలి రమణీయంగా రచించాడు.

(X)1 సముద్ర మథన వేళ నావిర్భవించిన లక్ష్మీదేవి ..

యొక్క జననాదిక వర్ణన మూలము అమూలకము.

వామన చరిత్రలో కూడా కొన్ని పోతన కల్పనలు కలవు.

" ఇంతింతై వటుడింతయై మరియు దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున నల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువుని పైనంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై".

ఇది అమూలకమే.

(X)2 గజయూథ ప్రస్థానము మొదలు యూథపతి మకరిచే పట్టుబడు వరకు గల కథ మూలకమున కంటె అనువాదమున ఎన్ని రెట్లో పెరిగినది. నిజమునకు అందు కథ లేనే లేదు. ఉత్ప్రేక్షాదికము వర్ణనయే. పోతన ఇతర సందర్భములలో వలెనే ఇక్కడ కూడా వర్ణనల చేతనే ఆ ప్రకరణమును పెంపొందించెను.

గజేంద్రుని స్తుతి మాత్రము ఇంచుమించుగ మూలానుసారము గానే యథాతథముగా, ఆ స్తోత్రముల మొదటి భాగమునందలి కొన్ని పద్యములకు మాత్రము మూలము లేదు.

" లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్దప్పెను - - -
— — —
— — — — సంరక్షింపు భద్రాత్మకా! "

# పోతన అనువాద విధానం.

~~[illegible]~~

పోతన గారి భాగవత అనువాదం లో ఆయన మీంద ఎర్రన, నాచన సోమన ల ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది. (1) భాగవతం సప్తమ స్కంధం ప్రహ్లాద చరిత్ర లోని ఎన్నో పద్యాలు ఎర్రయ్య గారి నృసింహపురాణం లోని గద్యపద్యాలు ఒజ్జబంతులు.

దశమ స్కంధం ఉత్తరభాగంలో నరకాసురవధ ఘట్టం లోని (2) సత్యభామా యుద్ధాన్ని పోతనగారు నాచనసోమని ఉత్తరహరివంశాన్ని అనుసరించారు. నాచన " అది [illegible] " అని వ్రాస్తే " పరుజాంచున్ జూంచున్ వాంఛించు " అని పోతరాజు గారు రాశారు. ఈ ఒక్క పద్యరచనా విధానంలోనే గాక నాచన సోమన్ని పోతన బాగా అనుసరించి అతడు చేసిన మూలవిరుద్ధమైన (3) మార్పులను అనుమోదించి భాగవతంలో చేర్చారు. శ్రీకృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో కూడా ఆడుతున్నప్పుడు కాశీరాజు కృత్యను ప్రయోగించాడని, ఆడుతున్న ఆటను ఆపగానే కృష్ణుడు చక్రాన్ని ప్రయోగించాడని నాచనసోమనుడు రాశాడు. ఇది మూలవిరుద్ధమే. దీనిని పోతన దశమస్కంధం ఉత్తరభాగం లో అనుసరించారు.

అని ' మందారమకరంద (4)

మాధుర్యమున తేలు మధుపమ్ము వోలికనే మదనవాటికల'

అనే భావం పోతరాజు గారికి బాగా ఇష్టం. దీని

ఆయన వాల్మీకి రామాయణం నుండి గ్రహించారని అని

ఆరుద్ర గారు తమ 'సమగ్రాంధ్ర సాహిత్యం' లో చెప్పారు.

~~అల్లసానిపెద్దన~~ (5) భాస్కర రామాయణం నుంచి పోతరాజు గారు అలవర్చుకున్నారు. నాచనసోముని నుండి మరియు శబ్దాలంకారాలు (6), ఎఱ్ఱన నుండి అర్థాలంకారాల (7) రమణీయంగా గ్రహించుకున్నారు. వాల్మీకి (8) అలంకారాలని పోతనే ఏకైక వారసులు గా ఉన్నారు. వీరందరి ప్రభావం ఆయన కవిత్వం మీద ఉంది.

భాగవత దశమస్కంధంలోని పలు ఘట్టాలకు సరిసమానమైనవి ఎఱ్ఱన గారి హరివంశం (9) లో ఎన్నో ఉన్నాయి.

## పాంచ భౌతిక శరీరము

### సంక్షిప్తంగా

Intro → కవితాశిల్పం ఒక్కటే భాగవత ఆదరణకి చాలదు ...

→ పద్యాల కొటేషన్

→ అద్భుత కల్పనలు < దృశ్యాలు/ఘట్టాలు, పద్యాలు

→ మూలాన్ని విస్తృతీకరించడం

→ అనౌచిత్యాన్ని పరిహరించడం

→ పూర్వకవుల ప్రభావం

→ అనువాద సాధారణ లక్షణాలు

భాగవత విశ్వజనీనత కు గల కారణములు

# పోతన భాగవత ప్రాశస్త్యము

" భాగవతానాం చరితం భాగవతమ్ " – భాగవతుల చరిత్ర భాగవతం అని నిర్వచనం. భక్తి, జ్ఞాన, వైరాగ్యాల చేత మోక్ష మార్గాన్ని సుగమం చేయగలిగినది భాగవతం. సంస్కృత వ్యాస భాగవతం తెలుగు లో " ఆంధ్ర మహా భాగవతం " గా అవతరించి తెలుగు సాహిత్యం లో పోతన ను భక్తకవి గా సహజ కవి గా నిల్పింది.

X

Intro → తెలుగు న గల పురాణేతిహాసములలో భాగవతమునకు గల సర్వ(ప్ర)జానురంజకత్వము మరి దేనికీ లేదు. దానికి గల ముఖ్య కారణములు ⊗ ✓ Intro — వేలూరి శివరామశాస్త్రి
✓ ముగింపు — పాంచ భౌతిక శరీరము

1) భక్తి విధానము : సంసార తరుణోపాయముగా భాగవతము ఉపదేశము చేసిన పరమ ధర్మము, దుష్కరమైన నిష్కామ కర్మ యోగము. భాగవతము పదేశించినది సుకరమైన భక్తి యోగము. ఇది సర్వప్రాణి సాధారణమైన తారక మంత్రము. నేటికీ ఆడువాళ్ళు గజేంద్ర మోక్షమును సంజీవని గా జపించు వారున్నారు. గోపికా గీతములను భగవద్గీత కంటే ఎక్కువ పారాయణము చేయు వారున్నారు. గొంతెత్తి ఆ ఘట్టములయందలి పద్యములను పాడుకొనుట కంటే వేరే జపములకు తపములకును అధిక ఫలప్రదములు కావని తెలుగు వారి విశ్వాసం.

2) పద్యగత గీతి : తెలుగున భాగవతములో సుస్వ

శిల్ప కౌశల్యము సర్వాంగ సుందరమైన ప్రౌఢములగు సమాసములతో క్లిష్టముగాదు. భాగవతము న సందర్భము నుండి విడదీసి ఏ పద్యము ను ఆనందించుటకు వీలగును. అది సహజమైన మూర్తి సౌందర్యము. ఇక భాగవత పద్యములు భజన కీర్తనల వలె, పెండ్లి పాటల వలె, ఏల పదముల వలె అతి మధురములై ఎల్లరు ఎల్ల వేళల పాడుకొనుటకు అనువై దేశమెల్లెడల వ్యాపించినవి. ఆ పద్యముల లోని శ్రుతి లయలు ఉచ్ఛారణా మాత్రముననే మనస్సు ను లాగొను శక్తి గలవి. ఏ పద్యమున కా పద్యమే ఒక కావ్యముగ పరిమళించు చుండును. భాగవత సౌలభ్యము విస్తృత లోకరంజకమగుటకు అదియే పద్యగత శైలియే కారణము.

3) కవి గొప్పదనము : భాగవత కవి అనుభవించిన దారిద్ర్యము, దాని నైరాశ్యాన్ని పోరాడిన ఆయన ధీరత్వము ఆశ్చర్య జనకములై లోకమునకు ఆ మహాను భావుని ఎడ ఎట్టి పూజ్య భావము ను కలిగించెను. ఆ భావమే భాగవతము నకు సంక్రమించెను.

పోతన భాగవతము ను తన దైవమైన శ్రీ రామ చంద్రునికి అంకితము చేసెను. ఆ

రామచంద్రుడే తన చేత వ్రాయించినట్లు గా చెప్పుకొనటం చేతనూ ఈ గ్రంథం పరమ పవిత్రమయినది. భక్తి ప్రధానంగా ఆంధ్ర సాహిత్యంలోన వెలువడిన గ్రంథములలో పోతన భాగవతమే సర్వోత్కృష్టమయినది.

4) కవితా శైలి : ఆంధ్ర భాగవతము ప్రసిద్ధి కెక్కుటకు ముఖ్య కారణము సులభమును, సుందరము అగు పోతన కవితా శైలియే అనవచ్చును. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం మూడూ సమపాళ్ళలో ఉన్న పోతన మనస్తత్వానికి అద్దం పట్టిన భాగవతమందలి మహార్థ కవిత్వ పటుత్వ సంపద దానికి సార్వజనీనతను సంతరించి పెట్టింది.

ఉభయ భాషా ప్రావీణ్యత (1)

" కొందఱకు దెనుగు గుణమగు
కొందఱకును సంస్కృతంబు గుణమగు రెండున్
కొందఱికి గుణములగునే
నందఱ మెప్పింతు గృతుల నయ్యై యెడలన్ "

అది పోతనే చెప్పుతున్నట్లు భాగవతం నిజంగానే అందర్ని మెప్పిస్తుంది.

' విహారేంద్రుడవో ప్రచ్చు కైవడి .... ' అని నృసింహావిర్భావ సమయంలో ఎంతటి సంస్కృత పదాలు వాడాడో

' ఓయమ్మ ! నీ కుమారుడు ... '

పద్యంలో అంతగా తెలుగు పదాలు వాడి చెప్పింది చూపి అందర్ని అలరింపజేశాడు.

శ్రవణానందము (2)

"తెలుగు భాషా మాధుర్యము ను చవిచూడ వలెనన్న భాగవతము నే పఠింపవలయును. పోతన కవిత్వము న అక్షర రమ్యత మెండు" అని దివాకర్ల వేంకటావధాని గారన్నది నిజం.

'అడిగెదనని కడు వడి ...' వృత్త్యనుప్రాస

'లేరా దనుజుల గెలువగ లేమా' యమకము

'కమలాక్షు నర్చించు కరములు కరములు' లాటానుప్రాస

ఇట్టివి శబ్దాలంకారాలు సహజంగా ఉండి శ్రవణానందాన్నిస్తాయి.

సమస్త కళలకును మూలధర్మములగు శ్రుతిలయలను కవిత్వమున ఛందోనిబద్ధములగు శబ్దమెంతవరకు సాధింపగలదో పోతన వలె దృష్టాంతపూర్వకంగా చూపిన భక్తకవి ఇంకొకడు లేడు. ఛందస్సంభవమైన మాధురి ఆయనకు వలె నింకొక కవికి లభ్యము కాలేదు. ఆయన శబ్దాలంకార ప్రయోగము దీనికి మరింత వన్నె పెట్టింది.

కవి స్వేచ్ఛగా పాడుకొను గానము ను, ఆ గానమునకు రూపమైన మధురాతిమధురమైన శబ్దము ను ఆ శబ్ద సంఘమునకు మనోహరమానమైన యంత్యప్రాసము కలిసి భాగవత కవితా పఠనము ను తాళమృదంగములతోడి గానసభగా ప్రవర్తింపజేయును. అందువలననే

భాగవతం అందర్ని రంజింపజేస్తుంది.

వర్ణనలు

(3) పోతన భగవంతుని వర్ణించునపుడు తాను పరమాత్ముని సాక్షాత్కారమును పొంది పాఠకులకు ఆ దివ్య మంగళ విగ్రహమును వర్ణించి ప్రత్యక్షీకరింపజేయును.

" ఇందీవరశ్యామ వందిత సుత్రామ ... "

అని కృష్ణుని రూపము ను కనులకునూ, మనసునూ దర్శింప జేసినాడు.. ఇలా భగవద్దర్శనం చేసుకోవాలనే తెలుగువాళ్లు భాగవతపద్యాలు చదవడానికి ఉవ్విళ్లూరుతారు.

" ఇంతింతై వటుడింతై మరియు దానింతై ... " ఈ నాటి ఆధునిక గ్రాఫిక్స్ కూడా సాధ్యం కానిది.

ఇట్లు వామనుడు పెరుగుచున్న విధము కన్నులకు కట్టించిన పోతన కవితా వైచిత్ర్యము ఇతరులకు అందనిదై భాగవత కీర్తి కారణమైంది.

రస పోషణ

(4) పోతన హృదయము భక్తిరసమయము మగుటచే అతడు రసము ను అత్యంత ఆవేశము లో నిర్వహించి భక్తి కూడా నవరసములలో నొకటేమో అన్న భ్రమ కల్పించును.

' నీ పాద కమల సేవయు ... నారు దయ సేయగదే '

' విష్ణుభక్తి చేని విబుధుండు విబుధుడే

పాదయుగము లోడి పశువు గాక '

ఇట్టి పద్యాల యందలి భక్తి ఆవేశము భాగవతాన్ని ప్రజాసాహిత్యం పొందేలా చేసింది.

"భాగవతమునకింతటి ప్రజాదరణము అందుటకు
(7) భక్తి భావము వలననే కాదు, మంద్ర గంభీర గమనము గల
యీతని శైలి వలననూ వచ్చినది. అది సమాస ధారా
విలసితము, ఓజః ప్రసాదోజ్జ్వలితము, బిగువైన శ్రీ పదబంధముల
సంస్కృతపదములు, తెలుగులు చెరిసగముగా గుచ్చిన మల్లెలజాజులై
పరిమళించును" — గడియారం వేంకటశాస్త్రి

అందుకు ఉదాహరణగా

" సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపడే... "
అన్న పద్యము ను చెప్పవచ్చును.

5) అనువాదము లో వైశిష్ట్యము: సంస్కృత భాగవతము నకు
లేని సార్వజనీనత ఆంధ్రమహా భాగవతము నకు సంతరించుటకు
మూల కారణము పోతన అవలంబించిన భక్త్యావేశము నిండిన
స్వతంత్రానువాదము. (x) పోతన కల్పించిన రమణీయమైన
అపూర్వ వర్ణనలు ఉదాహరణకు

'లావొక్కింతయు లేదు...'
'నల్లనివాడు పద్మనయనంబుల వాడు' వంటి పద్యాలు

అట్లే అలంకారాలను సాధించుటకు అధికయ వ్యాఖ్యను అనువదించుట,
తెలుగు లో భక్తి కవితకనుగుణమైన ఒక శైలిని రూపొందించడం,
సరసంగా లేని అంశాలను సైతం రసవత్తరంగా రూపొందించడం ఇత్యాది
అనువాద విధానాల ద్వారా ఆంధ్ర భాగవతం మూలంలో కంటే
సరళ సుందరమై, తీయని ద్రాక్ష పాకము న ఒప్పారి

తెలుగు ప్రజలందరి మనసు దోచుకుంది.

పోతన గారి భాగవత కథ

"మొన్న మొన్నటి వరకు తెలుగునాట బాలుర కందరకును కంఠస్థము. స్త్రీలు బిడ్డ లాలించుచును, పెళ్ళి ఆడుచును ఈ కథను రేయిలల నుగ్గుపెట్టుదురు."

— వేటూరి శివరామశాస్త్రి గారు.

(×) నిజానికి భాగవతం లోని పద్యాలుగా నేటికీ తెలుగు వారు భక్తితో పాడుకునే పద్యాల్లో చాలా వరకు మూలం లేనివే, పోతన భక్త్యావేశ ఫలితంగా జనించినవే...

(×) పోతన భాగవత విశ్వ జనీనతకు అందులోని మధురమంజులమైన శైలి భక్తిరసమయమైన వస్తువు ముఖ్య కారకాలు.

భాగవత దశమస్కంధం లో పోతన ఆత్మీయతా ముఖ్యంగా కనిపిస్తుంది. అందుకే ఈ భాగం అద్భుతమైన ఒక గీతకావ్యం 'lyric' లాగా అనిపిస్తుంది. పోతన శైలి అతి మధురమైంది. తెలుగు భాష కు నిసర్గమైన సంగీతమాధుర్యం ఇతని కావ్యం లో సర్వత్రా ముఖ్యంగా గోచరిస్తుంది. వర్ణనా సందర్భాల్లో పోతన శబ్దప్రాసాలను అధికంగా వాడలేదని అందుకే ఇతని కవిత మృదంగధ్వనిమయమైన సంగీతంలా విన్పిస్తుందని పండితులకు పామరులకు వృద్ధులకు బాలురకు, స్త్రీలకు పురుషులకు ఆంధ్రులందరి ప్రీతి ని చూరగొన దానికి భాగవతం లోని ఈ నాద సౌందర్యమే కారణమని దివాకర్ల వేంకటావధాని గారు వెల్లడించారు.

వేదమనే కల్పవృక్షం నుంచి జారిన ఫలం భాగవతం. దాన్ని సర్వజనాస్వాదితం చేసినది పోతన గారి ఆంధ్రమహాభాగవతం.

14.7.07

# పోతన భాగవతం లోని భక్తితత్త్వం

"పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట
పలికెద వేరొండు గాథ పలుకగనేలా?"

ఆది దేవున్ని ఒక ఆరాధనా మార్గంగా భవతరణోపాయంగా భావించిన భక్తకవి పోతన. కృష్ణుణ్ని సాంకేతం చేయడాన్ని వివరించి, మనుష్యాంధకారాలు ఛేదించి కృపావరుడై పేదవాళ్ళని వరించి భక్తిరస ఫలితాల్ని పండించిన కవి పోతన.

భాగవతం లోని 'భక్తి' ని క్రింది విధంగా అధ్యయనం చేయవచ్చు.

1) విష్ణు భాగవతం భాగవతానికి నాయకుడు పురాణ పురుషుడైన శ్రీమహావిష్ణువు. అనేక అవతారాలలో అనేక యుగాలలో అనేక చోట్ల ప్రవర్తిల్లిన ఆ విష్ణు లీలా విశేషాలతో, విష్ణు భక్తుల పావన చరిత్రలతో భాగవతం గుడి కట్టి ఆదిస్తుంది. ఇలా విష్ణుభక్తి పారమ్యాన్ని బోధించే భాగవతం కి "విష్ణుభాగవతం" అనే నామాంతరం ఏర్పడింది.

2) <u>పర దేవతా నింద లేదు</u>

పోతన శివ కేశవ భేదమును పాటించని సాత్విక భక్తుడు.

"చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని"

అని అంటాడే అనలేగాడు.

3) <u>కృష్ణలీలలు</u> భాగవతం లో కృష్ణలీలలు బాగా వివరింపబడింది. గోపికలది మధురభక్తి. జగమంతా కృష్ణమయమనే అది రాసక్రీడా ఘట్టంలో తెలుపబడింది. కుంతీదేవిది త్యాగభక్తి, బలి చక్రవర్తిది ఆత్మనివేదనా భక్తి, రుక్మిణిది పతిభక్తి, కుచేలునిది మిత్రభక్తి. భాగవత కల్పతరువుకు కృష్ణావతారమే మూలము ఆ కృష్ణుడే విష్ణువని "లలిత స్కంధము కృష్ణ మూలము ..." పద్యం చెబుతుంది.

4) <u>సర్వవిధ భక్తుల నిలయం</u> పోతన "తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ ..." పద్యంలో పోతన నవ విధ భక్తుల్ని పేర్కొన్నాడు. కానీ ఈ నవ విధ భక్తులే కాక <u>వైరభక్తి</u> మార్గాన్ని కూడా చూపించడం పోతన గొప్పదనం. భగవద్విరోధులు వారికి

తలియడుచుండానే వారి స్తుతి చేయిస్తూ పోతన నిబంధించాడు.

త్రిగుణాత్మక చిత్తవృత్తులలో; సిద్ధ సాధక ముముక్షు భేదావస్థలలో; స్త్రీ పురుష జడ ప్రవృత్తులలో భక్తి ఎన్ని శాఖోపశాఖలు గా విస్తరిస్తుందో అన్నిటినీ ఉపాఖ్యానాలలో వివిధ భక్త పాత్రలలో ఉదాత్తంగా ప్రపంచించి చూపించాడు పోతన.

5) భాగవతం లాంటి వస్తువు ద్వారానే గాక పోతన తన కవిత ద్వారా కూడా భక్తి పారవశ్యం అందిస్తాడు

కవిత లో
- లలిత శబ్ద సంయోజనం వల్ల
- మధురాక్షర శ్రవణావృత్తి వల్ల
- వృత్త్యనుప్రాసాది శబ్దాలంకార సంవిధానం వల్ల

శ్రవణసుభగత్వం కలుగుతుంది.

- భగవంతుని రూపగుణ సంకీర్తనం వల్ల
- ధారాశుద్ధి గల కవిత్వం వల్ల
- రాగ రంజితమైన శైలి వల్ల
- అలవోకగా అవధానం చేయడానికి అనువైన పద్య రచన వల్ల

సంకీర్తనా సాఫల్యం ఏర్పడుతుంది.

- భావనా గంభీరమైన అర్థాలంకారాల ప్రయోగం వల్ల
- ఆలోచనామృతాన్ని అందించే ఆధ్యాత్మిక తాత్పర్యాల వల్ల
- వ్యంగ్య సౌరభం వెదజల్లే శబ్ద వాక్య విన్యాసం వల్ల

ఏకత్వం పోతన లో చింతనం ప్రకాశిస్తుంది.

ఈ విధంగా పోతన తన రచనల ద్వారా శ్రవణం, సంకీర్తనం, చింతనం అనే భక్తి మార్గాన్ని పాటించి తన భాగవతం లో భక్తి తరంగాన్ని ప్రవహింపజేశాడు.

6) పరమాత్మని చేరడానికి జీవుడు పడే ఆరాటం లోని దశాభేదాల్ని గజేంద్రమోక్ష ఘట్టం లో చూపించారు.

గజేంద్రుడు

" కలడందురు దీనుల యెడ
గలడందురు పరమ యోగి గణముల పాలం
గలడందురన్ని దిశలను
గలడు కలండనెడు వాడు గలడో లేడో"

అని సందేహ స్థితిలో ఉన్నంత వరకూ భగవత్ సాక్షాత్కారం కలుగలేదు. కాని చివరికి సర్వార్పణ బుద్ధిలో

" నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా"

అని సర్వస్య శరణాగతి వేడి ఆక్రోశించడం లోనే భగవంతుడు కదిలి వచ్చాడు.

7) వృద్ధాప్యానికి కూడా మోక్షమార్గాన్ని పోతన భాగవతం అందిస్తుంది.

" కర్మతంత్రుడగుచు గమలాక్షు గొల్చుచు
నిష్ఫలము నియతవృత్తి నుండెనేని
ఖేదమున గర్మమెల్ల భక్తియై మెల్లన
ప్రబలమగుచు విష్ణుభక్తి చెడదు "

~~అలాగు~~ మానవుడు లౌకికమైన కర్మల్ని ఆచరిస్తున్నా నిరంతరం భగవద్ధ్యానం వల్ల మోక్షాన్ని పొందవచ్చునంటారు పోతన. ఈ నిరంతర దైవ ధ్యాన అవసరాన్ని

" పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్
హాసలీలా నిద్రాదులు సేయుచున్ ... "

అనే పద్యం చెబుతుంది.

8) ఈశావాస్యమిదం సర్వం అనే పరమార్థ తత్త్వాన్ని తన భాగవతం లో పోతన అద్భుతం గా అందించాడు. బలి చక్రవర్తి కడకు యాచకుడిగ వచ్చిన వటువు

" ఒకలు గారు నాకు ఒకలకునే నౌదు
నొంటివాడ జుట్టు మొకడు లేడు
సిరియు దొల్లి గలదు చెప్పెద నా టెంకి
సుకృతులందు దలచు జొచ్చి యుందు "

పలికిన పై పలుకులు అవతారమూర్తియైన రాముని యదార్థ వాక్యాలు.

అనాదిగా భగవంతుడు ఉన్నాడా? ~~ఉంటే~~ ఎక్కడ ఉన్నాడు? లాంటి ప్రశ్నలు ఉన్నవే. పోతన వారప్పుడే నేడు ఈ ప్రశ్నలు వేయించి - ప్రహ్లాదుని ద్వారా సమాధానం చెప్పించారు.

"ఇందుగలడందు లేడని
సందేహంబు వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు, దానవాగ్రణి, వింటే"

9) <u>మోక్షానికి భక్తి మార్గం</u>

మోక్ష సాధనలో జ్ఞాన, కర్మ మార్గాల కన్నా భక్తి మార్గమే సులువైంది, సకల ప్రాణికీ సాధ్యమైంది.

~~అందుకే~~ "నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
తాపస మందార! నాకు దయసేయగదే"

~~అంటుంది~~ భాగవతం.

"ఇదే భాగవత పరమార్థం. భాగవత హృదయమని చెప్పదగిన పద్యమిది" - ఆచార్య వేటూరి ఆనందమూర్తి

## 10) భక్తి లేని జీవితం వ్యర్థమని ఆర్తం



పోతన భక్తి పారమ్యం లో "అంధేందూదయముల్ __"
పద్యం లో గుడ్డివాడికి చంద్రోదయం లా, చెవిటి వాడికి
శంఖారావంలా, మూగవాడికి గ్రంథ పఠనాల్లా, నపుంసకుడికి
స్త్రీ కాంక్షలా, కృతఘ్నుడైన బంధువులా, బూడిదపాలైన హోమ
ద్రవ్యాలలా, లోభికి ధనంలా, పందికి సుగంధం లా భక్తి
లేని వాడి జీవితం వ్యర్థమని చెబుతాడు.

అంతేకాదు తాను కోరక

"కమలాక్షు నర్చించు కరములు కరములు" అని మొదలు పెట్టి
"హరి జేరుమనియెడి తండ్రి తండ్రి" అంటూ ప్రహ్లాదుడితో
మళ్ళీ తండ్రికే బోధన చేయించారు. అయినా ఆవేశం ఆగక

"విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే
పాదయుగము లేని పశువు గాక"
అని అన్నారు పోతన.

అసలు జీవిత పరమార్థమే భక్తి అని ప్రహ్లాదుని
నోటి ద్వారా మనందరికీ చెబుతాడు పోతన,

"జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకు పుట్టని చావని
త్రోవ వెదకి కనుట దొడ్డ బుద్ధి"

అంటూ మానవ జన్మ అసలు ఆశయం
మోక్షసాధనే కావాలని చెబుతారు.

ఈ విధంగా అడుగడుగునా భక్తి పారవశ్యం
అందించే కృష్ణలీలా ఘట్టాలు, విష్ణుభక్తుల గాథావళులు
ఉన్న పోతన భాగవత భక్తి కైవల్యం పోతన మాటల్లోనే

"నిగమములు వేయు చదివిన
సుగమంబులు గావు భక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా"

— · —

# విజయ విలాసము - పద్య చమత్కృతి

[ 'ప్రతి పద్యమునందు చమత్కృతి కలుగం
జెప్పనేర్తును' అని రఘునాథనృపాలునిచే కీర్తింపబడిన
చేమకూరవేంకటకవి విరచితమైన 'విజయవిలాసము'
దక్షిణాంధ్రయుగమునకు చెందిన ~~[illegible]~~ ఉత్తమ ప్రబంధము.]
ఇది విలక్షణమైన అద్వితీయ ప్రబంధము. మూడు
ఆశ్వాసాలు కలిగి అర్జునుడు ఉలూచి, చిత్రాంగద, సుభద్ర
లను వివాహమాడుట ఇతివృత్తముగా గల్గినది. దీనికి
మూలము భారతము నందు ఆదిపర్వమున గల
'సుభద్రా పరిణయ ఘట్టము.' ప్రతిపద్య చమత్కృతి
తో విజయవిలాసాన్ని రచించి దానిని రఘునాథనాయకునికి
అంకితమిచ్చినాడు.

[ చమత్కారము అంటే విస్మయం, నేర్పు అని
రెండు అర్థాలు నిఘంటువుల్లో కనబడుతాయి. బహుశా ఈ
రెండు అర్థాలు మేళవించి ఉంటాయని ఆరుద్ర గారు
అభిప్రాయపడ్డారు. (వారి) చేమకూర వారి దృష్టిలో
నేర్పు అంటే శ్లేష అని చెప్పాలి. అబ్బురమైన
కొత్త విరుపులను ఆవిష్కరించే రచనను ఆయన
చమత్కారం క్రింద భావించారు. రామరాజభూషణాదుల
వసుచరిత్రాదుల్లో సైతం ప్రతిపద్య చమత్కారాలున్నా

అవి దిగేదాకా లోతు తెలియని చందం లో ఉంటాయి. కానీ గట్టు మీద నిలబడితే లోతు తెలియాలని వెంకటావధాని అభిమతం. అందుకే చేమకూర వారి చమత్కృతి 'ప్రసన్న గంభీరత' తో కూడినది.

చేమకూర గారు ఈ చమత్కారాన్ని పలు విధాలుగా సాధించగలిగారు. ఆయన చూపిన

① శ్లేష ప్రాగసులు కేవల తెలుగు మాటలకే చెందినవి. చిత్రాంగదను వివాహమాడదలచి అర్జునుడు విశారదుని ఆమె తండ్రి వద్దకు పంపునపుడు చెప్పిన పద్యం లో

'అప్పుడు నృపుడు ప్రఫుల్ల - - - - - - -
కమలాక్షునకు మామకాగమువార్త - దెలుపు' మనుచు విశారదుబంపెను

ఇందులో 'మామకాగమువార్త' అనుచోట 'మామక + ఆగమువార్త' అని, 'మామకున్ + ఆగమువార్త' అనియు జూలూరు అప్పయ్యగారు, వేదం వెంకటరాయ శాస్త్రిగారు వ్యాఖ్యానం చేశారు. ఆచార్య తాపీ ధర్మారావుగారు 'మామ + కాగ + మన + వార్త' అని తెలుగు విరుపుల్ని చూపారు.

ఇవి యమకాలంకార చమత్కృతి అప్రయత్న సాధ్యాలు.

'మన సుభద్ర సుకాలమహామయేమనవచ్చు. మనసు భద్రమయ్యె మనచెల్లి' అన్నప్పుడూ 'అమ్మక చెల్లి నా హృదయ

అన్య అర్థములు తపోవర్ణనము చెప్పవచ్చు.

(5) యమకాలంకార చమత్కృతి ఈ కావ్యానికి విశేషశోభ చేకూర్చినది. మచ్చుకు

'యమునానది గూడిన లో
యమునానది తనరె - - - '

(6) శబ్ద చమత్కృతికి ఉదాహరణలు పట్టుగొమ్మ. అందుకు

'నుప్పి ఉప్పి నప్పి ఒప్పని నాసిక
చిప్పరు సప్పరు ఒప్పరు నునిద హెంవి
ముబ్బు మబ్బు గెబ్బు బిబ్బు కవలి వేణి
మొటుపు నాటుపు బటుపు దెటుప మేను.' పద్యం

సాక్షీభూతము గా నున్నది.

(7) వెంకటకవి సంభాషణా చమత్కృతిని కూడా సాధించాడు. అర్జునుడు విహారదూతతో చెప్పే

'తనకుం గొంకిలి యీ వాక్యప్పుడు - - -
రారాయని పిల్చెం దాని ద్విరేఫోద్యాంత దీర్ఘధ్వనుల్'

పద్యంలో తనను సూర్యునిగా చెప్పుకొనుచు పద్మిని గా తలచి ఆమె భ్రమర విషయమున తనను సూర్యుని 'రారా' అని పిలుచుచున్నదని చమత్కరించెను.

వేంకటకవి భావనా చమత్కృతి గొప్పది.

అర్జునుడు పలికిన

'భామ మోమున వ్రేలు కుంకుంబు జూచి
ముదిత యెదఁ బాయకుండెడు మూర్తిఁ దలంచి
రమణిపై సగమైన విగ్రహంబు నెంచి
ప్రోవుమని వేడుకొను దేవపూజ వేళ!'

పద్యంలో త్రిమూర్తుల వేడుట బాహ్యము. సుభద్ర ను సంగమ భాగ్యము వేడుట ఆంతరము.

'భ్రమరక మణిహారంబౌట పద్మముగను
తారకాహ్లాదముగుట సుధానిధియగు
రెంటి జగడాలు మోమున నంటియుండు
నబ్జముఖియంటు వెస యీ యలరుఁ బోడి!'

పద్యంలో శ్లేష చమత్కారము పరాకాష్ఠాయిని చేరింది. సుభద్ర ముఖము భ్రమరకములచే పద్మముగాను తారకలచే చంద్రబింబముగానియు వివాదము చెలరేగినది.

భ్రమరకములు = తుమ్మెదలు, ముంగురులు

తారకలు = నక్షత్రములు, కనుపాపలు

జగడాలు = తగవులు, జగ + డాలు = ప్రసిద్ధమగు కాంతులు

అబ్జముఖి = చంద్రముఖి, పద్మముఖి అని రెండింటి శ్లేష.

ఈ రెంటి వివాద పరిష్కారమునకు ఆమెను అబ్జముఖి అనుట తగునని వేంకటకవి చమత్కారము.

ఇట్టి ప్రతిపద్యచమత్కారయుతంగా విజయవిలాసాన్ని వెలయించి తన ప్రభువు చేతనే 'కృతిలోని మార్గమెవరికిన రాదుసుమీ!' అని ప్రశంసలందినాడు / ప్రశంసలందిన ఘనుడు చేమకూర.

## Gist

చమత్కృతుల వివిధ రీతుల్లో

1) శ్లేష
2) ఊహ
3) యమకాలంకారం
4) లోకోక్తుల ద్వారా
5) అనుప్రాసల ద్వారా
6) సంభాషణల ద్వారా
7) శబ్ద
8) అర్థ

రాయల అనంతరయుగమున తిరుగులేని కవివరేణ్యుడు చేమకూర వేంకటకవి. 'పంచదార వెన్నెలయగా తీయగా కవిత్వం చెప్పిన ఘనుడు!'

ఇతని 'సారంగధర చరిత్ర' మూడాశ్వాసాల ప్రబంధము. ఇతడిందులో ప్రబంధోచితముగ కొన్ని మార్పుచేర్పులు చేసియున్నను పూర్వకవుల కథితకావ్యము కాక పోవుటచే దాని సమకాలిక సరసులు మెచ్చుకొని యుండరు. కనుకనే 'ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా' అని వాపోయాడు.

<u>ప్రసన్న గంభీర రచన:</u> వాక్య జనముల కాక, నలుగురికి తెలియు సామెతవంటి వార్త, సహజార్థముల చమత్కారముతో కావ్యములో ప్రతిపదమును సమర్థవంతముగా నుండును. దీన్ని వేంకటకవి 'అర్థగౌరవము' అని వ్యవహరించెను. సారంగధర చరిత్రములోని 'కలరా యల రాయనికిం గలరి ---- తిరువు రంబులోనిది విభూషల్' పద్యంలో రత్నాంగి సత్వభావమును, చిత్రాంగి కోరిక స్వభావమును సూచించాడు. వారిద్దరిని క్రమముగా 'అరుణకర భార్య' 'ఇందుని భార్య' అని పద్మములకు చంద్రునికి వలె విరుద్ధంబైన ప్రేమభావమును చెప్పినాడు. చిత్రాంగిని ఇందుని భార్య అని చెప్పుటచే పద్మములకు బాధ కలిగించునది చంద్రుడు కనుక ఆమె వలననే రత్నాంగికి హాని కలుగునని భావికథార్థ

## లోకోక్తులు :-

'ప్రాణదానంబుకన్న ప్రాభవముగలదె' (ఉదా)

'పరసతి నేరయుట రాజులకు ధర్మమే'

'ఏ గాలి రాకుండినన్ సమగాలిలో వారలు మెచ్చరేరదా.'

'మనమున నున్నది మొగమున గనుపించున్'

## జాతీయములు :

'పంచ బంగారమై పాలు దలమె'

'కాయో పండో పోయినది'

'తెలుగు రాజు'

## సామెతలు :

'మొగ్గరమునకు బావ మొసలెత్తుకొని పోయె'

'చదువగబెట్ట నున్న మతియును బోయె'

'ఉదకన పిండు నందుయున్నను (గాయు) పట్టుకోను'

ఇట్లు విషయపరంగా నేచూచినా చూచినను ఉత్తమప్రబంధమే. అట్లే విద్వాంసులలో కవియే మెచ్చిన కావ్యమిది.

"ఈ చేమకూర చక్రి రమణుడిలా అమ్మలాడు పాడించి పెంచినదిగాని మట్లాలా వీరు పాడించి పెంచినది కాదు."

27.9.02

# తెలుగు నవల పుట్టు పూర్వోత్తరములు

నవల ఆధునిక సాహిత్య ప్రక్రియ. ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్ల తెలుగులో ఆవిర్భవించిన ప్రక్రియ ఇది. నవల పుట్టటానికి ముందు దాదాపు అన్ని భాషల్లోను చాలా కాలంగా బహుళ ప్రచారాన్ని పొందుతూ ఉన్న సాహిత్య ప్రక్రియ మహాకావ్యం (epic). మహాకావ్యం రాజరిక జమిందారీ సంస్కృతికి దర్పణం. మహాకావ్యాలు సామాజిక చిత్రాలే కాని వ్యక్తి చిత్రాలు కాదు. ఫ్యూడల్ యుగం తర్వాత సామాజిక దశ బూర్జువా యుగం. బూర్జువా సంస్కృతి రూపొందించుకున్న సాహిత్య ప్రక్రియ నవల. బూర్జువా సంస్కృతి నిర్మాతలు మధ్యతరగతి ప్రజలు. వారే నవలకు నిర్మాతలు పోషకులు కూడా.

యూరోపియన్ దేశాలలో ప్రాచీన గ్రీక్, రోమన్ సంస్కృతి అధ్యయనం కారణంగా నూతన భావాలు వ్యాపించడం ప్రారంభించాయి. సాంస్కృతిక పునరుజ్జీవనం, పారిశ్రామిక విప్లవాల ఫలితంగా ప్రజాస్వామ్య భావాలు విస్తారంగా వ్యాపించటం ప్రారంభించాయి. ఈ ఆర్థిక, సామాజిక పరిస్థితులు మధ్యతరగతిని సృష్టించాయి. మధ్య తరగతి బలీయమైన సామాజిక శక్తిగా రూపొందిన తరువాత అక్షరాస్యత చాలా త్వరగా అభివృద్ధి చెందింది. ఈ పరిణామానికి ముద్రణా యంత్రం ఎంతో దోహదం చేసింది. అక్షరాస్యత నగరాల నుండి గ్రామ ప్రాంతాలకు వ్యాపించింది. వీరిలో చాలామంది మొదటి తరం అక్షరాస్యులు. కాబట్టి వీరికి సంప్రదాయ పాండిత్యం లేదు. అందుచేత వీరు పాండిత్యపు బరువు ఎక్కువైన ఉన్నత సాహిత్యం కాక తమ ఆశలకు, ఆశయాలకు అనువైన సాహిత్య ప్రక్రియ కావాలని కోరుకున్నారు. ఆ కోరికలో నుంచి నవల ఉద్భవించింది.

పారిశ్రామిక 17వ శతాబ్దంలో జరిగిన బ్రిటిష్ విప్లవం యూరప్‌లో ప్రజల ఆలోచనా పద్ధతినే మార్చివేసింది. సామాజిక సంబంధాలలో కూడ గణనీయమైన మార్పులు తీసుకు వచ్చింది. అంతవరకు గడ్డకట్టిన సరస్సులా ఉన్న సమాజం కరిగి ప్రవహించటం ప్రారంభించింది. ఆ ప్రవాహశీలత యూరప్ నవల ప్రాముఖ్యానికి దోహదం చేసింది. ఇలా నవల మారుతున్న సామాజిక సంబంధాల నుంచి ఉద్భవించిన ప్రక్రియ.

ఇక తెలుగు నవల ప్రాముఖ్యానికి దారితీసిన పరిస్థితుల్ని చూద్దాం. 1857లో భారతదేశం ప్రత్యక్షంగా బ్రిటిష్ పాలన కిందకి వచ్చిన తర్వాత కూడ కోస్తాజిల్లాలలో జమీందారీ వ్యవస్థ, రాయలసీమ జిల్లాలలో పాళెగాళ్ళ వ్యవస్థ పూర్తిగా పోలేదు. ఈ వ్యవస్థల్లోని దోపిడి విధానం వల్ల సామాన్య రైతులు అప్పుల పాలై చాలామంది తమ పొలాలను పోగొట్టుకున్నారు. కానీ గోదావరి, కృష్ణా ఆనకట్టల నిర్మాణం (1852 నుంచి 1855 లోపు వరుసక్రమంలో) కోస్తా జిల్లాల స్వరూపాన్ని స్వభావాన్ని పూర్తిగా మార్చివేసింది. బీడు భూములు సస్యశ్యామలమై సామాన్య రైతులు, భూస్వాములు అనతికాలంలో సంపన్నులై పోయారు. 22 జిల్లాలున్న మద్రాసు రాష్ట్రంలో రెవిన్యూ వసూళ్ళలో 13వ స్థానంలో ఉన్న గోదావరి జిల్లా 2వ స్థానానికి వచ్చేటంతగా దాని ఆర్థిక స్వరూపం మారిపోయింది. పత్రికలు, ముద్రణా సాధనాలు కోస్తా ప్రాంతానికి ఎక్కువగా అందుబాటులోకి వచ్చి కోస్తాజిల్లాలలోని పట్టణాలు - ముఖ్యంగా రాజమండ్రి - సాంస్కృతిక కేంద్రాలుగా రూపొందాయి. ఈ గణనీయమైన ఆర్థిక వృద్ధి ప్రభావం ఇతర రంగాలతో పాటు విద్యారంగం పైన కూడా పడింది. 1852 తర్వాత విద్యావ్యాప్తి బాగా పుంజుకుంది. ఆర్థికంగా అప్పుడే బలపడుతున్న గోదావరి జిల్లాలో

స్థానికంగా వేసుకొనే చందాల సాయంతో నడిచే 'లోకల్ స్కూళ్లు' ప్రారంభమై విద్యావ్యాప్తికి దోహదం చేశాయి. 1871 ప్రాంతంలో మదరాసు రాష్ట్ర ప్రభుత్వం 'స్థానిక నిధుల' సృష్టించి వాటిని విద్యాభివృద్ధికి వినియోగించటం ప్రారంభించగానే విద్యాభివృద్ధి మరో విస్తృతమైంది. అనేక స్వచ్ఛంద క్రైస్తవ సంస్థలు జత కలిశాయి. 1877 లో మదరాసు రాష్ట్ర ప్రభుత్వం స్థాపించిన మూడు మొదటి గ్రేడు కాలేజీల్లో ఒకటి రాజమండ్రిలో స్థాపించబడింది. ఆంధ్ర దేశంలో ఉన్నత విద్యను మొదటిసారిగా రుచిచూపించింది రాజమండ్రి కాలేజీయే ఇలా ఆర్థికంగా, విద్యా పరంగా ముందంజ వేసిన ఇక్కడే ~~[illegible]~~ (గోదావరి ప్రాంతంలోనే) తొలి తెలుగు నవల ఆవిర్భవించింది.

తెలుగులో నవల ప్రాదుర్భవించటానికి ముందు మహోజ్జ్వలంగా వెలిగిన సాహిత్య ప్రక్రియ ప్రబంధం. ఇది పండితుల కోసం పండితుల చేత రచింపబడ్డ అద్భుతమైన సాహిత్య ప్రక్రియ. ఇది రాజరిక భూస్వామ్య వ్యవస్థ పతాకస్థాయికి చేరుకున్న విజయనగర సామ్రాజ్యకాలంలో అనంతమైన వైభవాలు పొందింది. ప్రబంధాలు నవకాలీన సామాజిక జీవితాన్ని ప్రతిబింబించాయి. విజయనగర సామ్రాజ్యం పతనమై ఆ శిథిలాల మీద వెలసిన మధుర, తంజావూరు, పెనుగొండ, చంద్రగిరి మొదలైన చిన్న చిన్న రాజ్యాల కాలంలో కూడా ప్రబంధం తన పట్టు సాగించి మరింత వెకిలిగా, అశ్లీలంగా తయారైంది. ఈ చిన్న చిన్న రాజ్యాలు పతనమైన తర్వాత జమీందారీలు వెలిశాయి. తెలుగు సాహిత్యం జమీందార్ల ఊడిగం చేయటం ప్రారంభించింది. కవి సామాజిక బాధ్యతను పూర్తిగా విస్మరించాడు.

చివరకు 1857 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య పోరాటం మీద తెలుగు కవులను కదిలించలేకపోయింది.

ఆంగ్ల విద్య యువతరంలో భావవిప్లవాన్ని కలిగించింది. ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను పాఠ్యగ్రంథాలుగా నిర్ణయింపబడిన పుస్తకాలను చదివిన యువకులలో అలాంటి గ్రంథాలను (ప్రక్రియలను) మన భాషలో కూడా రాయాలనే ఆకాంక్ష ప్రబలింది. ఆ ఆలోచన కార్యరూపం ధరించడానికి ముద్రణాయంత్రం, పత్రికారంగం, వ్యావహారిక భాషా వ్యాప్తి తోడ్పడ్డాయి. ఈ నేపథ్యంలో తెలుగు నవలా ప్రక్రియ ఆవిర్భావం జరిగింది.

1872 లో లార్డ్ మేయో, బంగాళాదేశీయుల ఆచారవ్యవహారాలు, జీవన విధానం తెలియజేసే గ్రంథానికి బహుమానం లభిస్తుందని బెంగాలు గెజిట్ లో ఒక ప్రకటన చేశాడు. ఆ రోజుల్లో ఆంధ్రప్రాంతంలోని తర్వాత జిల్లాలో డిప్యూటీ కలెక్టరుగా పనిచేస్తున్న నరహరి గోపాలకృష్ణమ్మశెట్టి గారు ఆ ప్రకటనలో ప్రేరితులై 'శ్రీరంగరాజ చరిత్ర' అనే చిన్న వచన ప్రబంధం' రాసి 1872 లో ప్రకటించాడు. ఈ రచనను మద్రాసు గెజిట్ 'తొలి తెలుగు నవల'గా పేర్కొన్నది. నాటి సమకాలిక పత్రికలు కూడ దీనిని నవలగానే సంభావించాయి. రచయిత మాత్రం పొందువుల ఆచారములు తెలుపు 'నవీన ప్రబంధం' అని దీనిని పేర్కొన్నాడు. దీనిలో చారిత్రకమైన పాత్రలున్నప్పటికీ ఇది జరిగిన కథ కాదని, కల్పించిందేనని రచయిత ప్రస్తావించాడు. సంఘంలో

ప్రచారంగా తనకుడు ఉన్న కులాచారాలు, కట్టుబాట్లు, సమ్మేళనాలు ప్రసక్తాన ప్రసక్తంగా రచయిత వర్ణించాడు. తెలుగులో నవలా రచనకు దీన్ని తొలి ప్రయత్నంగా భావించవచ్చు.

కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 1872 లో పూర్తిచేసిన 'మహాశ్వేత' అనే వచనకావ్యము రచించి రని, అదియే తెలుగు నవలకు ఆద్య రచన అని కొందరు పండితుల ప్రతిపాదన. అది సంస్కృత బాణుని 'కాదంబరి' లోని మహాశ్వేత వృత్తాంతమునకు అనువాదము మాత్రమే.

మద్రాసు కాలేజిలో పనిచేస్తున్న సమర్థి రంగయ్య చెట్టిగారు కందుకూరి వీరేశలింగం గారిని నవలా రచనకు ప్రోత్సహించారు. కందుకూరి, నవలా రచనలో తనకు మార్గదర్శకమైన గ్రంథాలు లేకపోవటంచేత ముందు ఒక ఆంగ్ల నవలని అనువదించి, ఆ తరువాత స్వతంత్ర రచన చేయవచ్చునని అనుకున్నారు. ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచించిన 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' ను ఎన్నుకొని, కొన్ని ప్రకరణాలు అనువదించే సరికి, విదేశీ వాతావరణమూ, పాత్రలూ, తద్దేశవాసనలు ఆయనకు సంతృప్తిని కలిగించలేకపోయాయి. అందువల్ల స్థూలముగా కథను మాత్రమే గ్రహించి దేశీయమైన వాతావరణంలో తెలుగు వారికి ఆకర్షణీయంగా ఉండేటట్లు 'రాజశేఖర చరిత్రం' పేరుతో క్రొత్త నవలను రచించారు కందుకూరి.

భూస్వామ్య వ్యవస్థ పట్ల అసహ్యాన్ని, సాహిత్యంలో ఒక విలువ,
ప్రజాస్వామ్య వ్యవస్థ పట్ల అభిమానాన్ని ఏర్పరచుకున్న
కందుకూరి వీరేశలింగం రచన 'రాజశేఖర చరిత్రం'. దీనిని
'వివేక చంద్రిక' అను నామాంతరముతో కూడా
దీనిని 1878 సం॥లో తాము నడుపుతున్న 'వివేకవర్ధని' అనే
మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించారు కందుకూరి
వారు. తరువాత 1880లో పుస్తక రూపాన ఈ నవల
ప్రచురితమైంది. రాజశేఖర చరిత్రలో ఆ కాలపు
తెలుగువారి సమగ్ర స్వరూపం కనబడుతుంది. సాంఘిక
జీవనాన్ని ఎంతో ప్రతిభావంతంగా కందుకూరి చిత్రించారు.
సంఘంలో ఆనాడు ప్రచురంగా ఉన్న దురాచారాలు,
అంధవిశ్వాసాలు ఈ నవలలో యథాతథంగా ప్రతిబింబి-
చాయి. 1887 సం॥లో రాజశేఖర చరిత్రం 'ఫార్చ్యూన్స్ వీల్'
పేరుతో ఇంగ్లీషులోనికి అనువదించబడగా దానిని
'లండన్ టైమ్స్' పత్రిక గొప్పగా మెచ్చుకొంది. 1887కే
తెలుగు నవల ఇటువంటి ఘనగౌరవం పొందటం
తెలుగువాళ్ళు గర్వించదగ్గ విషయం. రాజశేఖర చరిత్రం
అరవం, కన్నడం వంటి ఇతరభాషల్లోకి కూడా అనువాదం
అయింది. ఇది ఈ నవల ప్రశస్తికి తార్కాణం.

తరువాతి నవలలకు 'రాజశేఖర చరిత్రమే'
ఆదర్శము. కనుక వీరేశలింగం గారిని తెలుగు నవలా
పితామహుడు అనవచ్చును. 1883లో 'సత్యవతీ చరిత్రము'
అను మరియొక నవలను వీరేశలింగంగారు రచించి
యుండిరి. అది తెలుగులో వెలువడిన మొదటి సాంఘిక
నవల. ఆంగ్లము నందలి జోనథన్ స్విఫ్ట్ రచించిన 'గల్లివర్స్
ట్రావెల్స్' అను నవల ఆధారముగా కందుకూరి వారు 'సత్యరాజా
పూర్వదేశ యాత్రలు' అను మరియొక నవల రచించిరి.
'చంద్రమతీ చరిత్రము' వారి మరియొక వచన ప్రబంధము.
స్త్రీ జనోద్ధరణమునకై ఉద్దేశింపబడిన పంతులుగారి
ఈ రచనలన్నియు విశేషాదర పాత్రములై ఇతరభాషలలోనికి
అనువదింపబడినవి. 1880-90 మధ్య కందుకూరి ఒక్కరే
తెలుగులో నవలా రచయిత. వారితో ప్రారంభమైన తెలుగు

నవల [illegible] తెలుగులో [illegible]

# రఘునాథ నాయకుడు

'అభినవ భోజరాజు' బిరుదాంకితుడైన రఘునాథ నాయకుడు తంజావూరు నాయక రాజులలో నాయకమణి. శ్రీకృష్ణదేవరాయల వలె సాహిత్య సమరాంగణ సార్వభౌముడు, కవి పండిత పోషకుడు. మహాత్మ ద్విగుణిత మహాభిషేకము, పరమతసహనము గలవు. ఇతడు సంగీతనాట్యవిశారదుడు. ఇతని కళానిలయము 'విజయ భవనము'. కవులకేగాక కవయిత్రులకు కూడా ఆశ్రయమొసగి ఆదరించిన సహృదయుడు.

రఘునాథుడు సంస్కృతమున మహాభారత తాత్పర్య సంగ్రహము, రామాయణ కథాసారము, సంగీతసుధ సాహిత్యసుధ, భరతసుధ మొ॥ రచించెను. ఇతడు 'జయంతసేన' అనే క్రొత్త రాగాన్ని, 'రామానందము' అను క్రొత్త తాళమును, 'రఘునాథమేళవీణ' యను మేళాంతరమును సృష్టించిన ప్రతిభాశాలి. ఇతడు తెలుగులో వ్రాసినవి తొమ్మిది రచనలు. బాల్యంలో ఆశువుగా చెప్పిన 'పారిజాతాపహరణము' ప్రబంధము, అచ్యుతాభ్యుదయము, గజేంద్రమోక్షము అను ద్విపదకావ్యాలు, 'రుక్మిణీ కృష్ణ వివాహము' అను యక్షగానమును 'జానకీ పరిణయము' అను నాలు కావ్యములును అలభ్యములు. తెలుగు సాహిత్యంలో నాయకాభ్యుదయ ప్రక్రియకు ఆద్యునిగా రఘునాథునే చెప్పవచ్చు.

ఇతడు యక్షగాన ప్రక్రియా ప్రియుడై స్వయముగా యక్షగానం రచించుటే గాక ఆ ప్రక్రియను విస్తృతంగా పోషించినాడు.

ఇతని లభ్యకృతులైన 'వాల్మీకి చరిత్ర' 'రఘునాథ రామాయణము', 'శృంగార సావిత్రి' అనునవి ప్రబంధములు. కాగా 'నలచరిత్ర' ద్విపదకృతి. ఈ రచనలన్నియూ రామాంకితములే.

<u>వాల్మీకి చరిత్ర</u>: ఇది మూడాశ్వాసముల ప్రబంధము. ఇందు 450 గద్యపద్యములున్నవి. ఇది సంస్కృత 'ధర్మఖండము' నందలి వాల్మీకి చరిత్ర ననుసరించినది. ఇతివృత్తము ఆర్షమైనను రఘునాథనాయకుని వాల్మీకిచరిత్ర కల్పనాశాఖలపైన స్వతంత్ర రచన.

రామభక్తుడైన రఘునాథుని <u>ఆత్మీయత</u> ఈ కావ్యమందు వెల్లడగుచున్నది. సప్తర్షులు సందర్శించిన వివిధ ఋష్యాశ్రమములలో [illegible] తప్ప తక్కినవన్నియు దాక్షిణాత్యములే, పైగా అందు తంజావూరు కూడా చొప్పబడింది.

సప్తర్షులు చూచిన బోయపల్లెను వర్ణించిన

"తోరణంబులుగ వీథుల నారగట్టిన యెముపుగండలకు నొండొండ చెరుగ
— — — — —
భయము గొల్పెడు నా బోయపల్లె గాంచి"

రఘునాథనాయకుని 'వాల్మీకి చరిత్ర' యందు వేదాంతసారము ను సులభముగ ఉపదేశించెను.

'సతులెవ్వరు సుతులెవ్వరు
హితులెవ్వారెటు వలద నెందే నాకబో
జతగూడిన కాష్ఠంబుల
గతి నింతక గూడివిచ్చి కదలుదురవలన'

పద్యాన్ని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

ఈ కావ్యములోని వాల్మీకి హృదయ పరివర్తన ఘట్టము ఇతని పాత్ర చిత్రణమునకు పరమోదాహరణము.

" నుదుట చెంగల్వబొట్టు పదనింక గాదని
తులసి మృత్తిక నూర్ధ్వతిలక మిడియె

— — — — —

మారుతుపదేశ[illegible] మిచ్చిన మంత్రమెప్పుడు
జపము సేయుచు నవ్వన చర విభుండు "

పద్యాలలో వాల్మీకి పూర్వ వృత్తిని విడిచి సాధువుగా మారి మంత్ర జపము చేయు ఘట్టము మనోహరముగా చిత్రించబడినది.

పద్యాలు అంటే నిజోక్తి పరిశీలనకు ప్రబల దృష్టాంతాలు.

'వాల్మీకి చరిత్ర' లాంటి కిరాత జీవిత వర్ణనలు సహజ మనోహరాలు. వెదురు బియ్యాలు దంచుచున్న బోయెత స్వభావమును

" కుదురుగ సంగడాలి చనుగుబ్బలు మీటగ బాళియుటాడ బ
య్యాద పాదలంగ నెన్నుదు రాకెంత చెమర్పంగ

\- - -

\- - - బియ్యాలు గట్టు విప్రయోగాంగన "

పద్యం లో ప్రత్యక్షీకరింపచేశాడు.

రంభానర్తనాల సంగీత నాట్య వివాద ప్రసంగాలు అందలి నాట్య విశేష వర్ణనలు రఘునాథుని శాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనము.

శ్లేష వర్ణనలలో రఘునాథనాయకుడు చేసిన కల్పనలు స్వభావోక్తులలో కూడిన మనోహరమైన అర్థవంతమైన చమత్కారములకు చక్కని ఉదాహరణలు.

మచ్చుకు

" వెలవెల పగలెం గుంభిని
తలతల పక్షులు మనంబు తల్లడ పడియెన్
చెలచెల సెగసెన్ దవశిఖి
కలకల ప్రత్యంబుకాంత కనబడు నల్లన్ "

శ్రీరంగ? పద్యాలు రఘునాథుని ప్రసన్నశైలికి, ధారాశుద్ధికి ఉదాహరణాలు.

"పసమున(బని లేదట|, నా పాపమ్ములు వేలకు దినంబుల గలదే
రోసిలి సంసారము(దెగ(|గోసిలి మొదలంట బంధుగుల తగులెల్లన్"

రఘునాథుని సరసత్వాన్ని, రసికత్వం, వైదుష్యం అనన్యసామాన్యం. రఘునాథుని సంగీతసాహిత్యాల నిధిత్వానికి, పాండిత్య ప్రకర్షకు, ఉత్తమ కవితా లక్షణాలకు పరమ నిదర్శనము వాల్మీకి చరిత్రము.

రఘునాథ రామాయణము: ఇది సమగ్రముగా దొరకలేదు. మొత్తము 467 గద్యపద్యాలు మాత్రము లభించినవి. వాల్మీకి రామాయణమునందలి కథామాత్రము గ్రహించి రఘునాథనాయకుడు స్వతంత్ర గ్రంథముగ రామాయణానువాదమునకు పూనుకొనెను.

ఈ కావ్యము రసభావ రమణీయముగ రచింపబడినది. రసప్రాధాన్యమును వివరించుచు రఘునాథుడు తన రామాయణావతారికలో

"పలుకగవలె నవరసములు గులుకం బద్యములు చెవులకున హృద్యముగా
నలుక కమలగర్భునకుం, బలుకక యుండుటయె మేలు బహుమానముగన్."

అని చెప్పాడు. క్రీడా పరాయణముగు క్రౌంచ మిథునమును

"ఒక్క మహిళ సాహసము — —
దొక్కటి ఒక్క విప్పుకొని — —
ముక్కుల మేను గరుచును, మోవున మోవును చేర్చి మిళ్ళలిన
ముక్కవ నుండ క్రౌంచ మిథునంబు గమనించి సంభ్రమంబుగన్"

అంటూ రసభావ బంధురంగా వర్ణించాడు.

వాల్మీకి భరద్వాజులు చూచిన తమసానదిని మూలకము నందు సామాన్యముగ వర్ణింపగా రఘునాథుడు దానిని

'మిసమిస మెఱయు తలిపల, నిసుకలు గల వచ్చుచుండ
— — — మనసు రంజిలఁ జేయున'

అని కల్పనా సౌకర్యముతో భావబంధురంగా చిత్రించాడు.

ఇందలి ఋష్యశృంగుని పాత్ర రఘునాథుని కి గల అపార లౌకిక జ్ఞానమును, మానవ మానసిక తత్త్వ వివరణమును, పాత్ర నిర్మాణ కౌశలమును, శృంగార వర్ణ్య రస పోషణములను వ్యక్తము చేయుచున్నది.

శృంగార ప్రాధాన్యత: ఇందలి శైలి, కథాకథన విధానము న రఘునాథుడే ఈ గ్రంథకర్తయని వెల్లడించుచున్నవి. ఇది రెండాశ్వాసముల శృంగార ప్రబంధము. వస్తువు కూడా సమకాలీన పాత్రలతో పోషింపబడినది. దీనికి మూలము భారతము అరణ్య పర్వములోని సాంఖ్యోపాఖ్యానము. ~~అయితే~~

మాళవి ఆశ్వాసములు సమాగమ వివాహాదులు అప్రాసంగికమైనను రఘునాథుడు వానిని ప్రబంధోచితముగా వర్ణించినాడు.

తేటతేట మాటలు, భావవైవిధ్యములు, సరసపద సంధానములు ఈ గ్రంథమునకు ప్రశస్తిని గూర్చుచున్నవి. దురాన్వయముగాని క్లిష్టపద రచనగాని ఇందు గానరాదు. శీలవతి -యను సాధ్వి యొక్క సాంసారిక చిత్తవృత్తులను మనోహర స్వభావోక్తిలో

"ప్రొద్దున లేచి తాఁ బసుపు కుంకుమ బొట్టు ధరించియు
పెద్దలకెల్ల మ్రొక్కి తన పెన్మిటికిం బరిచర్య సేయుఁగాఁ
— — — —
— — — పారణసేయు మిక్కిలిన్"

అని చిత్రించినాడు.

బుద్ధిగమ్యమగు నైపుణ్యము కన్న రసమార్గమే ఈయన కావ్యమునకు లక్షణము.

నలచరిత్ర: ఇది పూర్వోత్తర కథాంశములున్న ఐదాశ్వాసముల ద్విపద కావ్యము. ఇతని మిగిలిన కృతులలో సాధారణముగా కానవచ్చు సంగీతసాహిత్యాభిమానము, శృంగార - హాస్య రసపోషణ ఇందు అంతగా కానరావు.

రఘునాథనాయకుడు కథావిషయమున మహాభారతాంతర్గత పర్వములలోని నలకథనే గ్రహించినను

రచనా విషయమున నవరస నాథుడగు శ్రీనాథుని శృంగార నైషధ కథను అనుసరించి వివిధ మార్పు కూర్పులు చేసి తన ద్విపద నలచరిత్రను కావ్యరూప దృష్టితో రసవత్ప్రబంధముగా రచించాడు.

రఘునాథనాయకుని నలకథలో శనిప్రవేశము గలదు. అట్లే సరస్వతియో బ్రాహ్మణుడో గాక చెలికత్తెలు స్వయంవరానికేగు రాజులను దమయంతికి చూపినట్లు తెలుపబడినది, రఘునాథుని స్వతంత్రత వ్యక్తీకరింపబడినది. చెలికత్తెలు చుట్టూ చేరియుండగా దమయంతి వీణ వాయించుచు నలుని పై గీతములు పాడించినట్లు రఘునాథుడు నూతనముగ కల్పించాడు. ఇది అతని సంగీతసాహిత్య కళాభిజ్ఞత్వమునకు నిదర్శనము.

బహురూపకములందున్న నలుని వంటపాకములను రఘునాథనాయకుడు కల్పించి

"కలమకూరలు మంచి కమ్మకూరలును -- క్రొవ్వుపొర మండిగలును"

పద్యంలో చక్కగా చిత్రించాడు.

పదముల పొంకమును, నుడికారముల అందమును వర్ణనా చమత్కారమును పాత్రపోషణా విధానమును రఘునాథనాయకుని కవిత్వమునకు వన్నె పెట్టినవి. వస్తువికలత మెప్పునట్లు, వర్ణనాంశములు కథకు బాధకట్టినట్లు మాటల చిత్రీకరణను చిత్రించుటయందు రఘునాథునికి చక్కని నేర్పు కలదు. అట్లే నలదమయంతుల దుర్భర కష్టములను వర్ణించునట్లు అతడు కరుణారసమును వెల్లివిరియించాడు.

# మార్గ - దేశి కవితా సంప్రదాయాలు

నన్నెచోడుని 'మును మార్గకవిత...' అనే పద్యం లో మార్గకవిత సంస్కృత కవిత అని, ప్రాంతీయ భాషల్లోని కవిత 'దేశి' అని వేదం వెంకటరాయ శాస్త్రి వంటి వారు వివరించారు.

అయితే ఆధునిక సాంస్కృతిక చరిత్ర పరిభాష లో సంస్కృత సంప్రదాయపు ప్రభావం గలది "మార్గ" గానూ, ఆంధ్ర ప్రాంతం లోనే పుట్టుక గలది "దేశి" గానూ పరిగణించబడుతుంది. ఈ ప్రకారం గా చూస్తే

| | మార్గ | దేశి |
|---|---|---|
| వస్తువు | పురాణేతిహాసాదులు | ప్రాంతీయ వీరగాథలు, స్థానిక భక్తుల కథలు, అద్భుత, జానపద కథలు |
| ఛందస్సు | ఉత్పలమాలాది వృత్తాలు | తేటగీతి, ఆటవెలది, సీసం, ద్విపద మొ॥వి |
| భాష | తత్సమ పదభూయిష్ఠశైలి | దేశ్యపద ప్రాచుర్యం, తెలుగు నుడికారాలు జాను తెనుగు |

మౌఖిక సంప్రదాయం లో జానపద సాహిత్యంగా శుద్ధ దేశి ఆదిమ కాలం నుంచే ఉంది. నన్నయ ఆంధ్ర భారతం నుంచి తెలుగు మార్గ కవిత మనకు లభిస్తుంది. పాల్కురికి శుద్ధ దేశి సాహిత్యాన్ని ప్రామాణికం గా మలచడం తో తెలుగు లో మిశ్రిత లేదా విశుద్ధ దేశి మొదలైంది. నాటి

నుంచి (క్రీ.శ.12 వ శతాబ్దం) తెలుగు కావ్య రచనలో మార్గ దేశి ప్రవృత్తులు విడదీయరాని సమాంతరంగా కొనసాగుతూనే వచ్చాయి. ఈ రెండింటి సమాంతరంగా ఆదిమకాలం నుంచీ అలిఖితమైన మౌఖిక రూప శుద్ధ జానపద దేశి విడివడి సాగుతూనే వస్తుంది.

తెలుగు సాహిత్యంలో ప్రాచీనకాలంలో చంపూ ఆంధ్ర భారతం, ఆధునిక విశ్వనాథ రామాయణం, పురాణాలు, (కావ్యయుగపు) కావ్యాలు, ప్రబంధాలు, దక్షిణాంధ్రయుగం లోని చిత్రగర్భబంధ కవితాది సాంప్రదాయికాలు 'మార్గ' అవుతాయి. ఆధునిక కాలంలో అవధాన కావ్యరచన; పద్య ఖండకావ్యాలు, మహాకావ్యాలు, లఘుకావ్యాలు 'మార్గ' అనవచ్చు.

తెలుగు నిబద్ధ దేశి సాహిత్యం ద్విపద, శతకం, ఉదాహరణ, రగడ ల్లాంటి రచనలతో మొదలైంది. [illegible] అన్నమయ్య సంకీర్తనలు, 'పల్నాటి వీర చరిత్ర' (ద్విపద), అనంతర ప్రబంధయుగం లో వెల్లివిరిసిన యక్షగానాలు, పదకవితలు, 'శృంగార సంకీర్తనలు' వంటి సంకీర్తన ఛందస్సు, వేమన శతకం ఇవన్నీ నిబద్ధ దేశికి చెందుతాయి. ఆధునిక యుగం లో గేయసాహిత్యం, మాండలిక సాహిత్యం ఈ కోవ లోనివని చెప్పవచ్చు.

నన్నయ 'నాగ గీతాలు' నన్నెచోడుని 'ఓవియల పదాలు' 'గౌడ గీతాలు' 'అంగమాడలు' మొదలైన పాటలలో శుద్ధ దేశి సంప్రదాయం వెల్లడౌతుంది. శుద్ధ దేశి లోని పల్లెపాటలు, బాలగేయాలు, వీరగాథలు వంటివి పామర దేశి అని స్త్రీల పాటలు వంటివి జానదేశి అని అంటున్నారు.